This Book "Sri Harikathamrutha Saram" by Sri Jagannath Dasulu of Manvi in Kannada Is Translated and Published by Sri Manur Jayatheertha Charlu Gadwal, Dist. Mahbubnagar (A. P.).



Copy's : 1000 1992

Price : 10/- Rs.

This Book is Published with the aid of T. T. D. Tirupathi under the Scheme of aid to Publish relegious Books.

Printed at
Sri Rama Printing Press, Mahbubnagar-509002.

# తొలిపలుకులు

కన్నడ హరిదాస పరంపరలో దాస శ్రేష్ఠులైన పురందరదాసులకు శ్రీ జగన్నాథ దాసులవారు నాల్గవవారు, విజయదాసులకు పురందరదాసులు గురువులు గోపాలదాసులకు విజయదాసులు గురువులు శ్రీ జగన్నాథ దాసులకు గోపాల దాసులు గురువులు, వీరే తమ 47 సం॥లు ఆయుర్దాయము జగన్నాథదాసులకిచ్చి హరికథామృతసారము రచించునట్లు ఆజ్ఞాపించిరి.

వీరి తండ్రి నరసప్ప తల్లి లక్ష్మీబాయి తిరుపతి శ్రీ వెంకటేశ్వరుని సేవించి వీరిని వరపుత్రునిగా పొందిరి. కావుననే శ్రీనివాసాచార్యులని పేరిడిరి వీరు శాస్త్రాధ్యయనము జేసి మధ్వ మతసారమైన ఈ గ్రంథము రచించిరి. వీరికృతిలోని మహత్వ విషయములు తెలుగువారి కెందుకు తెలుపగూడదని నాకొకరోజు ఏకాంతములో ప్రేరణ గలిగినది. వెంటనే ఆ కార్యము చేపట్టి త్వరలో ముగించితిని. తెలుగు "తత్వవాదము"లో ప్రకటింపబడినది. ఆ తరువాత భావార్థము వ్రాసితిని. అందునుండి 5 సంధులు మాత్రమిపుడు ధర్మసంస్థానమైన తిరుమల తిరుపతి దేవస్థానము వారి సహాయముతో ప్రచురించి ఆంధ్రపాఠకుల హస్తాలంకరణ జేయుచున్నందుకు నాకెంతో సంతోషము గలుగుచున్నది. శ్రీహరికథామృతసారములోని "శ్రీ గణపతిస్తోత్ర సంధి" అవిహహితులు, నిర్ధనులు, రోజుకు రెండు పర్యాయములు, పారాయణము చేసినవారి మనోకామములు పూర్తి అగునని అనుభవైక సత్యము.

అనివార్యముగా ముద్రణదోషములు పడినవి చదువరులు సహృదయతతో క్షమించగలరు. ధన సహాయము జేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నామనఃపూర్వకమైన కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను. మరియు శ్రీరామా ప్రింటింగ్ ప్రెస్ యజమానియైన శ్రీ రాములుగారు శ్రద్ధ వహించి సర్వాంగ సుందరముగా అచ్చువేసినందుకు ధన్యవాదములు.

మణూరు జయతీర్థాచార్యులు
గద్వాల

॥ శ్రీ ॥

# శ్రీమదాంధ్ర హరికథామృతసారము.

## శ్రీ మహాగణపతి స్తోత్ర సంధి. 1

భామినిషట్పది.

హరికథామృత సారము‌ను గురు
కరుణతో నిటు నేను జెప్పెద
పరమ భగవద్భక్తులిది యాదరమున వినుండు. ప.

శ్రీశచరణ సరోజభృంగ మ
హేశ సంభవ మన్మనంబు వి
కాశ పరచగ, వేడుకొందును ప్రేమభరమునను।
పాశధర పాలించు వేద
వ్యాస కరుణకు పాత్రుడా
కాశపతి కరుణాబ్ధి చేయూత గాచు మమున్. ।

శ్రీలక్ష్మీ పతియగు శ్రీమన్నారాయణుని పాద కమలములకు తుమ్మెదవంటి వాడవైన ఓ వినాయకా! నీవు ఎల్లపుడు నా హృదయమునందు ప్రకాశింపుము. నిన్ను ప్రేమాతిశయముతో ప్రార్థించు చున్నాను. ఓ పాశాంకుశధారీ, శ్రీ వేద వ్యాసులు రచించిన మహాభారతము, వ్రాసి, వారి దయకు పాత్రుడైనవాడవు. ఆకాశమున కధిపతివి. మాకు చేయూతనిచ్చి రక్షించుము. 1

ఏకదంత ఇభేంద్రముఖ! చా
మీకరకృత భూషణాంగ! కృ
పాకటాక్షమున జూడుము విన్నపము వినుము.
నోకనీయుని బొగడునట్టి వి
వేకి సుజనుల సంగసుఖమును
నాకు నొసగుము, పరమ కరుణామూర్తి! ఎల్లపుడున్. 2

ఒకే యొక కోరగలవాడా! గజముఖుడా! బంగారు సొమ్ములతో నలంకృతమగు శరీరము గలవాడా! నన్నెల్లప్పుడును పరమాత్మస్తుతించునట్టి సుజనుల సహవాస మందుంచి, దయతో రక్షించుము. 2

విఘ్నరాజా! విషయసుఖమున
మగ్నమగు నా మనసు బహుదో
షఘ్న పాదాంబుజమునను సద్భక్తిపూర్వకమున్,
లగ్నమగునటు జేయుము నరక భ
యాగ్నులకు నేవెరవ గురువర
భగ్నమగునటు చేయుమా చెడు గుణము లెల్లపుడున్. 3

ఓ విఘ్నరాజా! విషయ సుఖములో మునిగియున్న నా మనసును దోషరహితుడైన శ్రీహరి పాదాబ్జములలో లీన మగునట్లు జేయుము. నరక భయమను అగ్నికి నేను భయపడను. ఓ గురూత్తమా! నా దుర్గుణముల బాపి రక్షింపుము. 3

ధనప విష్వక్సేన వైద్యా
శ్వినులకున్ సముడైన షణ్ముఖు
ననుజుడ! శేషశతస్థ దేవోత్తము వియద్గంగా
వినుత విశ్వోపాసకుడ! స
న్మనసునను వేడెదను లక్ష్మీ
వనిత కధిపతి భక్తి జ్ఞానములిచ్చి గాచుమమున్ 4

కుబేరుడు విష్వక్సేనుడు దేవవైద్యులగు అశ్విని దేవతలకు సమానుడైన షణ్ముఖుని తమ్ముడును, శేష = మిగిలిన నూరుగురి కన్నను శ్రేష్ఠుడైనవాడవు. విష్ణు సహస్రనామములో ఆదియందున్న. విశ్వ నామక హరిని పూజించువాడవు కావున ఆది పూజలకర్హుడైనవాడవు. ఇట్టి నీవు శ్రీహరియందు భక్తిని జ్ఞానమును యిచ్చి రక్షింపుమని శుద్ధమైన మనస్సుతో నిన్ను ప్రార్థింతును. 4

చారుదేష్ణాహ్వయుడవగనవ
తార మందితివి రుక్మిణిలో
గౌరిపతి వరముతో దుష్టులగు రాక్షసులన్
శౌరి యానతి దున్ముచున్ భూ
భారనాశక కరుణి నీ పా
దారవిందంబులకు ప్రొక్కెద నిమ్ము సన్మతిని. 5

చారుదేష్ణుడను పేరుతో శ్రీకృష్ణుని కుమారునిగా అవతరించితివి, కావుననే శౌరియనబడు శ్రీకృష్ణుని ఆజ్ఞతో దుర్మార్గులగు రాక్షసుల నాశనముజేసి భూదేవి యొక్క భారమును దింపితివి, నీవు దయగల వాడవు. నీ పాదకమలములకు నమస్కరించెదను. నాకు సద్బుద్ధిని ప్రసాదింపుము. 5

శూర్పకర్ణ! విరాజితేందుని
దర్పహర! ఉదితార్క సన్నిభ,
సర్పవరకటిసూత్ర! వైకృతగాత్ర సుచరిత్ర!
స్వార్పితాంకుశపాశకర ఛళ
దర్ప భంజన కర్మ సాక్షిగ
తర్పకుడ వీవై సంతృప్తి బరచుము సర్వ సజ్జనులన్. 6

చేటలవంటి చెవులుగలవాడా! ప్రకాశించునట్టి చంద్రుని కాంతిని మించిన కాంతి గలవాడా! బాల సూర్యునివలె రక్త వర్ణము పోలిన వాడా! చక్కటి పాము మొలత్రాటిగా గలవాడా! వికృత శరీరము గల వాడా! మంచి చరిత్రము గలవాడా! సకలకర్మలకు సాక్షిభూతుడైన వాడా! నన్ను సంతృప్తి బరచుటయే గాక సజ్జనులనుకూడ సంతృప్తి బరచుము. 6

భాశ: మిక్కిలి భక్తితోడను
వ్యాసకృత భారతము నెఱిగి ప్ర
యాస మందక వ్రాసి పెట్టితి వీవులోకమునన్.
పాశపాణివి, వేడికొనెదు వ
దేశమిమ్ము తదర్థముల కృ
పాశరధి దయగలచూపులన్ ననుచూడు మెల్లపుడున్ 7

ఓ ఆకాశాభిమానీ! వేదవ్యాసులవారు రచించిన మహాభారతమును దాని అర్థము తెలుసుకొనుచు ఆ గ్రంథమును సునాయాసముగా వ్రాసి లోకమునకుపకారము చేసినావు. పాశధారీ! ఆ గ్రంథము యొక్క అంతరార్థము నాకు దెలియునట్లుగా నన్ననుగ్రహింపుము. 7

శ్రీశు సతినిర్మల సునాభీ
దేశవాసివి, రక్తచందన
భాసిగాత్రుడవీవు సుచరిత్ర! సురమిత్రా!
మూషకవరవహన ప్రాణా
వేశయుత ప్రఖ్యాతభక్త జ
నాశయంబుల పూర్తిజేయుము సర్వకాలమునన్.   8

ఓ ప్రభూ, నీవు శ్రీమన్నారాయణుని పవిత్రమైన నాభిలో నివసించువాడవు. ఎఱ్ఱచందన లేపనముతో భాసించువాడవు దేవతలకు మిత్రుడవై శ్రేష్ఠమైన చరిత్రగలవాడవు. అట్టి నీవు నీభక్తుల కోర్కెల పూరించుము. 8

శంకరాత్మజ దైత్యులకు భ
యంకర ఫలంబులిడగా
సంకట చతుర్థిగతుడైయహితార్థములనిచ్చి!
మంకుమనుజుల మోసగించుచు
శంఖ చక్రధర ప్రియ, పాద
పంకజములకు మ్రొక్కెద వేడెద గావు మెల్లపుడున్. 9

ఓ రుద్ర కుమారా! దైత్యులకు భయంకరమైన గతినిచ్చుటకై నీవు సంకట చతుర్థీ నామక వ్రతరూపియై లౌకిక ఫలముల నిచ్చి వారిని మరింత మూర్ఖులుగా జేసి శంఖ చక్ర ధారియగు శ్రీహరి కతిప్రియుడవైనన్ను రక్షింపుమని వేడుకొనుచున్నాను. 9

సిద్ధ విద్యాధరగణసమా
రాధ్యచరణ సరోజ సర్వసు
సిద్ధినాయక, శీఘ్రముగ మన్నింపుమా మనవిన్
బుద్ధివిద్యాజ్ఞాన బల పరి
శుద్ధ భక్తివిరక్తినిడియన
వద్యలీలల బొగడునట్టుగ జేయు మెల్లపుడున్. 10

సిద్ధ విద్యాధరులతో చక్కగా పూజింపబడు పాదకమలములు గలవాడా, సర్వసిద్ధి ప్రదాయకా। బుద్ధిజ్ఞాన బలములను, యిచ్చి పరిశుద్ధభక్తి విరక్తులతో అసక్తుడైయుండునట్లుగా, ప్రతిదినము శ్రీహరి స్మరణలో ఆతని లీలాస్తుతులు నానోట ఎల్లపుడు వచ్చునట్లు జేయుము 10

రక్తవాసద్వయ విభూషణ।
ఉక్తిలాలించు నా భగవ
ద్భక్తవర భవ్యాత్మ భాగవతాది శాస్త్రములన్
సక్తమగునటు మనసు విషయ వి
రక్తినొసగుము విద్వదార్య వి
ముక్తునిగ జేయుము భవభయమునన్ దయతోడన్ 11

ఎఱ్ఱటి వస్త్రద్వయముతో నలంకరించు కొనినవాడా! పరమ భాగవతో త్తమా! విశాల హృదయుడా! నా మనవిని వినుము, భాగవతాది శాస్త్రములలో నా మనసు ఆసక్త మగు నట్లు చేసి లౌకిక విషయములలో వైరాగ్యమును ప్రసాదింపుము. ఓ విద్వత్ శ్రేష్ఠుడా! దయతో నన్ను సంసార భయము నుండి తొలగించి ముక్తునిగా జేయుము. 11

శుక్రశిష్యుల నాశమునకే
శక్రుండే నీ పూజ సల్పెను
విక్రముడు శ్రీరాముడును సేతుముఖమందున్
చక్రవర్తియు ధర్మరాజును
చక్రపాణి మాటలను విని
వక్రతుండుడ సాటిగలరే నీకు హరిదయతోన్. 12

శుక్రాచార్యుల శిష్యులైన దైత్యులను సంహరించుటకు దేవేంద్రుడు నిన్ను పూజించెను. మరియు మహా పరాక్రమ శాలియగు శ్రీరామ చంద్రుడు సేతుభంధన సమయమున నిన్ను పూజించెను. చక్ర వర్తియైన ధర్మరాజు కూడా శ్రీకృష్ణుని యుపదేశం మేరకు నిన్ను స్మరించెను. వక్రతుండా! పరమాత్ముని అనుగ్రహ సంపాదనలో నీ కెవరు సాటి? 12

కౌరవేంద్రుడు నిన్ను నమ్మని
కారణము నిజ జనులతో
సంహార మందెను సద్గుణ వృకోదరుని గదతోడన్.
తారకాంతకు ననుజ నాదుశ
రీరమందున నిలిచి ధర్మ
ప్రేరకుండగుచు సంతస మిమ్ము దయతోడన్. 13

ఓయీ! షణ్ముఖుని తమ్ముడగు వినాయకా, నిన్ను పూజింపక దుర్యో
ధనుడు మన గురు శ్రేష్ఠుడగు శ్రీ భీమసేనుని గదతో సపరివారముగా
సంహరింప బడెను. ఇట్టి నీవు నా హృదయమున సన్నిహితుడైనన్ను
ధర్మ మార్గమున నడచునట్లు దయతో నను గ్రహింపుము. 13

ఏక వింశతి మోదక ప్రియ
మూకులను వాగ్మలుగ జేయుక్ర
పాకరుండవు కృతజ్ఞ, కామదకాప్తుమము చేయూతన్
లేఖకాగ్రణి నా మనోదు
ర్వ్యాకులము బాపుము దయను పి
నాకి భార్యాతనుజ మృద్భవ వేడెదను నిన్నున్. 14

ఇరవైయొక మోదకముల ప్రీతిగలవాడా! మూగివారిని వాచాళులు
గా చేయు సమర్థుడా! నీవు కృతజ్ఞుడవు! దయాళువు, కోరిన కోర్కెల
నిచ్చువాడవు నామనసులో వచ్చు చెడు కోర్కెల తీసివేయువాడవు. శంక
రుని యర్థాంగినియగు పార్వతి శరీరము నుండి వెలువడిన మృత్తికతో
మూర్తీ భవించిన వాడా! నిన్ను ప్రార్థించెదను. 14

నిత్యమంగళ చరిత! జగదు
త్పత్తిస్థితిలయ నియమనజ్ఞా
నత్రయ ప్రద బంధమోచక సుమన సాసురులన్.
చిత్తవృత్తినెఱింగి నడచు, ప్ర
మత్తు గాడు సుహృజ్జనాప్తుని
నిత్యమున దలచి సుఖించు భాగ్యము నిమ్ము నాకున్. 15

ఎల్లప్పుడు కల్యాణకారీ చారిత్రము గలవాడవు, ప్రపంచ సృష్టిస్థితిలయ ముల ప్రేరకుడవు, కావుననే మూడు విధములైన జ్ఞానమునిచ్చువాడవు దానవుల మనః ప్రవత్తిని బట్టి నడచుకొనువాడవు అప్రమత్తుడవును అయిన నీవు సుజనుల బంధువైన శ్రీహరినిదలచి తలచి సుఖపడు నట్టిభాగ్యమును నాకనుగ్రహింపుము. 15

పంచ భేద జ్ఞానమిమ్ము వి
రించి జనకుని చూపుమనసున
వాంఛితప్రద, ప్రీతితోడను దాసుడంచనుచున్
పంచ వక్త్రుని తనయ। భవాబ్ధి
ముంచకయ గాచుము విషయముల
సంచరింపక యింద్రియంబుల నడవగానిమ్ము. 16

నాకు పంచభేద జ్ఞానము నిమ్ము బ్రహ్మదేవునిజనకుని ప్రత్యక్షము గా వింపుము ఓయిష్టార్థదాయకా! ప్రీతితో నన్ను ప్రీతితో నీదాసునిగా బా వింపుము శంకర కుమారా! నన్ను భవసాగరములో ముంచి వేయక విషయ సుఖముల వైపు నా మనసు బోకుండునట్లుగా చేయుము. సకలేంద్రియములును సరియైన రీతిలో నడచుకొనునట్లనుగ్రహింపుము 16

ఏమి వేడుదునెట్టిదైనను
యోనిజనికై వెఱవ లక్ష్మి
ప్రాణపతి తత్త్వేశులం గలసి గుణకార్యములన్
తాన జేయు నటంచనెడిసు
జ్ఞానమేకరుణింపు నాకుమ
హానుభావ ముహుర్ముహుః ప్రార్థింతు నీపాదమున్. 17

నిన్ను నేను మరేమీయు వేడను, చెడు యోనులలో జనించినను భయ పడను. కాని లక్ష్మిదేవి మరివాయుదేవులకు స్వామియైన శ్రీహరి త త్త్వాభిమానులతో త్రిగుణముల కార్యములను శ్రీహరి తానేజేయునను నట్టిసుజ్ఞానము మాత్రము నాకు గలుగునట్లు అనుగ్రహించిన చాలు నని మరిమరి ప్రార్థించెదను. 17

నమో నమో గురువర్య! విబుధో
త్తమ! వివర్జితనిద్ర కల్ప
ద్రుమమ వీహౌఘజకులకు బహుగుణభరిత సచ్చరితా!
ఉమకు తనయుడ! బాపుమాహం
మమత బుద్ధ్యాదీంద్రియములా
క్రమణతోనాయాసమిడు భవమునందెల్లపుడున్ 18

ఓ గురూత్తమా, నిద్రమగెలిచినవాడా, నిన్ను ఆరాధించువారలకు కల్ప వృక్షము వంటివాడా, దేవతలలో శ్రేష్ఠుడా! బహుగుణభరితా, శుభ చరిత్రముగలవాడా! పార్వతీతనయ! ఈ సంసారమందు అహంకార మమకారములు ఎల్లప్పుడు బుద్ధి మొదలగు ఇంద్రియములద్వారా నన్నలయజేయుచున్నవి, వానిని నిగ్రహింపుము. 18

జయజయతు విఘ్నేశ తాప
త్రయ వినాశన! విశ్వమంగళ
జయజయతు, విద్యాప్రదాయకవీత భయశోక!
జయజయతు చార్వాంగ కరుణా
నయనములజూచి జన్మా
మయమృతుల బాపుము భక్తులకు భవమందున్. 19

ఓ విఘ్నేశ్వరా! నీకు జయమగుగాక! తాపత్రయముల పోగొట్టువాడా! విశ్వ మంతటికిని మంగళము నిచ్చువాడా! విద్యా ప్రదాయకా! భయక్రోధ ములు లేనివాడా: నీకు జయమగుగాక. ఓసుందరాంగా! నీ కృపాపూర్ణ దృష్టితో నన్నుజూచి, ఈ సంసారమందు జనన మరణరోగాదులు రాకుండు నట్లు భక్తులననుగ్రహింపుము. 19

నీవు లంబోదరువంచును
నీవు కరుణా సింధు వనుచును
దేవ నీ పద జలజముల మ్రొక్కి ప్రార్థింతున్.
జీవకోటికి వచ్చు విఘ్నము
నీవ బాపుచు హరిని దలపగ
భావభక్తిని గలుగ జేయుమునాకు నెల్లపుడున్. 20

లంబోదరా! నీవు దయాసాగరుడవు. కావుననే నీపాద పంకజము లెల్లవుడు నమస్కరించి వేడుకొందును. నీభక్తులకు వచ్చు విఘ్నములబాపి సర్వదా శ్రీహరి నామ సంకీర్తనమున భక్తిగలుగునట్లుగా అనుగ్రహింపుము. 20

ఏకవింశతి పదములనబడు
కోకనద నవహారమును మై
నాకితనయాంతర్గత శ్రీప్రాణపతియునునట్టి-
శ్రీకర జగన్నాథ విఠలుడు
స్వీకరించుచు నాకు ముక్తి బ
హూకరించును భక్తులకు సుఖసంతృప్తుల్. 21

ఇరవైయొక పద్యములనబడు రక్త కమలహారమును స్వీకరింపుము. పార్వతీపుత్రాంతర్గత శ్రీజగన్నాథ విఠలుడు భక్తులకు స్వర్గాపవర్గముల ప్రసాదించును. 21



శ్రీగణపతి స్తోత్ర సంధి సమాప్తము.

## మంగళా చరణ సంధి (2)

### భామినీ షట్పది

హరికథామృతసారమును గురు
కరుణతో నిటునేను జెప్పెద
పరమ భగవద్భక్తులిదియాదరమున వినుండు. ప॥

శ్రీరమణీకరకమల పూజిత
చారు చరణసరోజ బ్రహ్మ స
మీర వాణీ ఫణీంద్ర వీంద్ర భవేంద్రముఖ వినుతా!
నీరజభవాండోదయ స్థితి
కారణుడ కైవల్య మిచ్చెడి
నారసింహుడ మ్రొక్కెద నిమ్ము మాకు సుమంగళమున్. 1

హరికథామృత సారమును గురువుల దయతో నా బుద్ధికి తోచినంతగా నిట్లు చెప్పుచున్నాను శ్రేష్ఠులైన భగవద్భక్తులు ఆదరణతో నాలకించునది. (పల్లవి)

అవతరణిక :— "బింబరూపోపాసనంచ కార్యం సద్భక్తి పూర్వకం" అను సత్తత్వమాల వచనాము గుణముగా తమ హృదయ కమలములో నున్న బింబమూర్తి నృసింహరూపముతో ప్రత్యక్షమైనందున సకల విఘ్నముల నివారించి కైవల్యమిమ్మని భక్తిభావముతో నమస్కరించుచున్నారు. శ్రీరమణీయని.

రమాదేవి కరకమలములతో పూజింపబడు మనోహర పాదములుగల బ్రహ్మ సరస్వతి వాయు భారతి గరుడశేషరుద్ర ఇంద్రాదులచే నమస్కరింప బడినట్టియు, సృష్టి స్థితిలయ కారణుడు, ముక్తిదాయకుడునగు ఓ నరసింహా! మాకు-(గ్రంథకారులకు) ఈ గ్రంథము యొక్క శ్రవణము పఠనము చేయువారికిని మంగళమును దయచేయుము. 1

జగదుదరుని సువిమల గుణ రూ
పగణముల చింతించి భారత
నిగమ తతుల నతిక్రమించి క్రియావిశేషములన్.
తగు వివిధ నూతనము జూచుచు
మిగుల హర్షము బొగడి యుబ్బుచు
త్రిగుణమాని మహారమాసతి ఎప్పుడు గాచుతను. 2

వాఙ్మనో వ్యాపార రూపమైన గ్రంథో పక్రమమున సకల వాఙ్మనోభిమాని యైన శ్రీదేవి వందన మావశ్యకమని శ్రీదేవిని ప్రార్థించుచున్నారు. ప్రపంచ మును తన కడుపులో ధరించిన పరమాత్మ యొక్క పవిత్రములైన మూల మరియు అవతారరూపముల లీలా విశేషముల నాలోచించి తెలుసుకొను నట్టియు, వేదములలో భారతాదులలో చెప్పబడని క్రొంగ్రొత్త మహిమలను చూచుచు పొగడుచు సంతసించు సత్వరజస్తమోగణములకభిమానియగు శ్రీమహాలక్ష్మి మమ్మల నెల్లపుడు కాపాడుగాక! 2

నిరుపమానందాత్మభవ ని
ర్జర సభా సంసేవ్యభుజులకు
దొరవు సత్వప్రచుర వాణీముఖ సరోజేనా!
గరుడ శేషశశాంకదళ శే
ఖరుల జనక జగద్గురుడ, నీ
చరణముల వినుతింతు సన్మతినిచ్చి రక్షించు. 3

విరజానదీ స్నానము జేయునట్టి అధికారులు యెవని ఉపదేశమున నే పరమాత్మ యొక్క స్థానము పొందుదురో అట్టి బ్రహ్మదేవుని మంచి బుద్ధిని ప్రసాదించుమని ప్రార్థించుచున్నారు నిరుపమయము పద్యముతో అసదృశ అనంద స్వరూపుడగు శ్రీహరి కుమారుడు, సకల దేవతలకు వంద్యుడును, విశుద్ధ సత్వస్వరూపుడు, సరస్వతి ముఖకమలమునకు సూర్యునివలె నున్న వాతును గరుడ శేషరుద్రులకు తండ్రియు జగద్గురువు అయిన ఓ బ్రహ్మ! నీపాదములకు నమస్కరింతును నాకు చిత్తశుద్ధినిచ్చి రక్షింపుము. 3

ఆరుమూడును రెండునొక వే
యారు నూరు శ్వాస జపముల
జేరి మూడగు జీవు లందజ కల్పమంతయును.
సార సుఖమిడి సాత్త్వలకు సం
సారమిడి మిశ్రుల కధముల క
పారదుఃఖములిచ్చు గురుపవమానగావుమమున్. 4

ఆరుమూళ్లు = పద్దెనిమిది. రెండునొకటి = మూడు = ఇరవైఒక వేయి, ఆరునూరు = మొత్తం ఇరవైయొక్క వేల ఆరునూరు శ్వాసరూపీ హంస మంత్ర జపమును మూడు విధములైన జీవులందు ప్రతి దినము, బ్రహ్మ ప్రళయము వరకు చేయించి సాత్వికులకు ముక్తిని రాజసులకు నిత్య సంసారమును, తామసులకు నరకమును ఇప్పించునట్టి ఓ వాయుదేవా! మమ్ము రక్షింపుము—జీవులందరు ముఖ్యప్రాణునిద్వారముగనె పరమాత్మను పొందగలరు. ''సర్వేదేవాఃప్రాణమావిశ్యదేవేముక్తాలయంపరమే యాంత్యచాత్యే (కౌషారవశ్రుతి.) 4

చతుర వదనుని రాణి యతిరో
హిత విమలవిజ్ఞాని నిగమ
ప్రతతులకు నభిమాని వీణాపాణి బ్రహ్మాణీ.
నుతిని గోరెద జనని. లక్ష్మీ
పతి గుణంబుల బొగడుటకు స
న్మతిని దయతోనిచ్చి, నిలునా వదన సదనమునన్. 5

బ్రహ్మదేవుని భార్యయు, ప్రతిబంధములేని నిర్మల జ్ఞానియు, వేదాభిమానియు, వీణాపాణీయు గురుపత్నియునైన ఓ సరస్వతీ! నిన్ను నమస్కరించి ప్రార్థించుచున్నాను. శ్రీలక్ష్మీపతియొక్క గుణములను స్తుతించుటకై నీవు నా నాలుకపై నెలకొని సమృద్ధిని దయచేయుము. 5

కృతిరమణప్రద్యుమ్న కూతుర
చతుర వింశతి తత్త్వపతి దే
వతలకున్ గురువనంబడు మారుతుని నిజపత్ని-
సతతమున్ హరిగురువులందలి
రతిని గావుము భాగవత భా
రత పురాణ రహస్య తత్త్వముదెలుపు దయతోడన్. 6

కృతిదేవికి పతియగు ప్రద్యుమ్నుని కూతురగు భారతీ దేవిని సమస్త తత్త్వములను దెలుపుమని ప్రార్థించుచున్నాను. 24 తత్త్వాభిమాని దేవతలకు గురువైన మారుతి పత్ని। శ్రీహరిగురువులందు దృఢమగు భక్తినిచ్చి భారత భాగవతములోని రహస్యతత్త్వములు ఎల్లప్పుడు జ్ఞాపకము వచ్చునట్లు కరుణింపుము।-చతుర్వింశతి తత్త్వములు:- 5 జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు 5 భూతములు 5 తన్మాత్రలు 5 అవ్యక్తఅహంకారము, బుద్ధి, మనసు = 24 6

వేదపీఠ విరించి భవ శ
క్రాది సురవిజ్ఞానదాయక
మోద చిన్మయగాత్ర లోకపవిత్ర సుచరిత్ర
చేదభేదవిషాద కుటిలాం
తాదిమధ్య విదూరుడైనా
నాది కారణ బాదరాయణ పాహిసత్రాణ। 7

వేదస్థానాధిష్ఠానుడైన బ్రహ్మ, రుద్ర, ఇంద్రాదిదేవతలకు జ్ఞానప్రదాయకుడైనట్టియు, ఆనంద జ్ఞానాత్మకుడు, లోకములను పవిత్రము జేయువాడును ఖడ్గ, బాణవ్యసనరోగాదులు లేనివాడును, బ్రహ్మాదులచే పూజితుడును, సజ్జనుల పాలకుడును ఐన వేదవ్యాసదేవా, నన్నుద్ధరింపుము. 7

క్షితిని మణిమంతుడే మొదలగు
నతిదురాత్ములు నొకటియును విం
శతి కుభాష్యాల్సలుప మధ్యగృహాఖ్య భూసురుని
సతి యుదరమున జన్మించి భా
రతి రమణుడే మధ్వాఖ్యుడై
చతుర్దశలోకముల వెలసిన గురుని నుతింతున్ 8

మణిమాన్ మొదలగు నతిదుష్టదానవులు భూమిపైపుట్టి ఇరవైయొక్కకు భాష్యములను ప్రచురింపజేయగా భారతీపతియగు ముఖ్యప్రాణుడే మధ్యగేహభట్టుపత్ని కడుపులో జనించి (అవతరించి) మధ్వాచార్యులను పేరుతో కుభాష్యములన్నింటిని ఖండించి పదునాల్గు లోకములలో ఖ్యాతి నిగడించినట్టి గురుని నమస్కరింతును. 8

పంచ భేదాత్మక ప్రపంచము
పంచ రూపాత్మకుడె దైవత
పంచముఖ శక్రాదులే కింకరులు శ్రీహరికిన్
పంచవింశతి తత్వతరతమ
పంచికల దెల్పిన రాగల పి
రించియగు నానంద తీర్థుల దలతు నెల్లపుడున్ 9

జీవజీవుల భేదము, జీవజడ భేదము, జడజడభేదము, జీవేశభేదము, జడేశ భేదములు గల ఈ ప్రపంచమునకు అనిరుద్ధ ప్రద్యుమ్న సంకరుషణ, వాసుదేవ నారాయణులను ఐదు రూపములుగలవాడే దేవత. ఇట్టి శ్రీహరికి బ్రహ్మరుద్రేంద్రాదులు సేవకులు, తంత్రసారములో జెప్పినట్లు, 'పురుషో వ్యక్తంచ మహానహంకారో మనస్తథా! భూతేంద్రియాణి శబ్దాద్యా భూతైతాః పంచవింశతిరితి' ఇరవైఅయిదు తత్వములు దేవతా తారతమ్యము మొదలగు వాటిని వివరించినట్టియు, రాబోవు కల్పమునకు బ్రహ్మయునగు శ్రీమదానంద తీర్థులను ప్రతి దినమును స్మరించుచున్నాను. 9

వామదేవ విరించితనయ ఉ
మామనోహర ఉగ్ర ధూర్జటి
సామజాజిన వసన భూషణ సుమనసోత్తంసా
కామ హర కైలాస మందిర
సోమ సూర్యానలవిలోచన
కామితప్రద కరుణనిమ్ము సదా సుమంగళమున్ 10

ఓ వామదేవ! ఓ బ్రహ్మకుమారా, ఓ పార్వతీపతి! శత్రు భయంకరుడా, జడలో గంగను ధరించినవాడా, ఏనుగు చర్మము ధరించినట్టి దేవశ్రేష్ఠుడా ఓ మన్మథ సంహారీ, కైలాసవాసీ, ఉమతోగూడినవాడా, సూరిజన ప్రియుడా, అగ్నిలోచనుడా, భక్తుల కోరికల దీర్చువాడా, మన కెల్లపుడు మంగళము నను గ్రహింపుము. 10

కృత్తివాసుడ తొల్లి నల్వది
మొత్తమగు కల్పము వాయు శి
ష్యత్వము న్నిఖిలాగ మార్థము చదివి జలధిలోనన్
సత్తపము పదికల్ప మందా
దిత్యులందతి శ్రేష్ఠడెపురు
షోత్తముని పర్యంక పదమందితివిమహదేవా। 11

ఓ మహాదేవా! పూర్వము నీవు వ్యాఘ్రచర్మము ధరించి నలువది కల్పము వరకును వాయుదేవుని శిష్యుడై సకలవేదాది సచ్ఛాస్త్రములు చదువుకొని పదికల్పము సముద్రములో మునిగి గూర్చుని తపస్సు జేసి, దేవతలలో శ్రేష్ఠుడను కీర్తిగడించి శ్రీమన్నారాయణునికి పడకయగు శేషుని స్థానము నందు కొంటివి. ఇట్టినీవు మా కెల్లపుడు మంగళమును ప్రసాదించుము 11

పాకశాసనుడాది సకల ది
వేకసుల వినుతింతుమునులను
నేక చిత్తమున పితరులను గంధర్వరాజులను ।
ఆకమలనాభాది యతులను
నీకమును నుతింతు విడువక ర
మాకళత్రుని దాసగణము నుతింతు నెల్లప్పుడున్ ।      12

ఇంద్రాది సకలదేవతలకును, ఋషి, పితృ, గంధర్వ దేవరాజులకును పద్మనాభనరహరి మాధవాక్షోభ్యతీర్థులే మొదలుగాగల యతులకును, మరియు లక్ష్మీపతికిదాసులైనవారిని ఏకాగ్ర చిత్తముతో నెల్లపుడు నమస్కరించుచున్నాను.      12

పరిమళము కుసుమమున నగ్నియు
నరణి నుండెడునట్లు దామో
దరుడు బ్రహ్మాదుల మనంబున గాంచిగానకయే
బరగెడు జగన్నాథ విఠలుని
కరుణగన్న ముముక్షు జీవులు
పరమభాగవతులను గొనియాడనగు ననుదినమున్ ।      13

పువ్వులోని పరిమళమువలెను రాగికర్రైతో జేయబడిన అరణలో నగ్నివలె, బ్రహ్మాది సకలదేవతలమనసులో నుండియు కనబడకుండునట్లున్న శ్రీ జగన్నాథవిఠలుని దయాపాత్రులైన మోక్షయోగ్యులు (మోక్షా పేక్షులు)ను పరమ భగవద్భక్తులను ఎల్లపుడు స్తోత్రము జేయునగును.      13



❀ మంగళాచారణ సంధి సమాప్తము ❀

## కరుణా సంధి. 3.

చెవులసోకగ మదికి ముదమిడు
భవజనిత దుఃఖముల బాపును
వివిధభోగంబులిహపరములనిచ్చి రక్షించున్,
భువనపావనమైన లక్ష్మీ
ధవుని మంగళకథల పరమో
త్సవమునన్ చెవులార విననగు బుధులుదినదినమున్। 1

వ్యాఖ్యానము:–అవతరణిక:–

"నిద్రయాహ్రియతే నక్తంవ్యవాయేన నవంవయః। దివాచార్థేహయా రాజన్ కుటుంబ భరణేనవా॥ యను భాగవతోక్తి ననుసరించి–నిద్రలో రాత్రియు, స్త్రీసంగమున నవయౌవనము, ద్రవ్యము గడించుటలో పగలును గడచిపోవును. కేవలము కుటుంబపోషణమే ముఖ్యమను కుజనుల సహవాసము విడిచి పెట్టి సచ్చిదానందాద్యనేక సుగుణ రత్నాకరుడైన శ్రీలక్ష్మీ బాహులలితాంగితుడైన శ్రీహరిని సాక్షాత్కరించుకొనగోరునట్టి సజ్జనులు భగవంతుని సత్తత్వశ్రవణముననే శ్రీహరియనుగ్రహించగలడని అతని దయారసము వివరించుటకే యీ కరుణా సంధిని మొదలిడుచున్నారు.

చెవుల సోకగ, యని:– శ్రీపతి మంగళకరమగు కథను ప్రాజ్ఞులు ప్రతిదినము నిరంతరము చెవులార వినవలసినది. ఎట్టి కథయనగ–శ్రవణ మాత్రమున మనసున కానందమిచ్చునదియు, సంసారము నుండి కలుగునట్టి దుఃఖముల బోగొట్టునదియు మరియు ఇహపరములందు వివిధ భోగములిచ్చి రక్షించునదియు లోకమున, సజ్జనులను పవిత్ర మొనరించును. 1

వాన నీళ్ళటు వీధిబారగ
మాన వెవ్వరు వాడగలరవి
యేనదుల గూడంగ జేతురు స్నానపానములన్।
హీనవచనములైననివి గం
గానదీ పితృపాదమహిమాం
భోనిధిని జొరనెట్లు విడుతురు భూమిసురులెపుడున్। 2

"గంగా సంగేన నైర్మల్యం రథ్యాద్భిర్జభ్యతేయధా। వాచోవిశుద్ధి సిద్ధ్యర్థం సంగమ్యంతే గురోర్గిర:। యను తత్త్వప్రకాశికవచనము ననుసరించి తాము రచించిన వచనములు దోషపూరితములైనను గంగాజనకుడగు శ్రీహరి మహిమా సముద్రములో కలసినందున సజ్జనులు స్వీకరించకమానరని నిశ్చయముగాజెప్పిరి. 2

శ్రుతితతుల కభిమాని లక్ష్మి
స్తుతులకు నగోచరుడ ప్రతి
హతమహైశ్వర్యాద్యఖిల సద్గుణగణాంభోధి
ప్రతిదినము తనపాద సేవా
రతమహాత్ములు సలుపు తత్ సం
స్తుతికివశుడగు నితని కరుణను బొగడగావశమే. 3

వేదాభిమానియు, సర్వజ్ఞయు నగులక్ష్మిదేవి పరమాత్మయొక్క గుణానంత్యములతో హర్షాబ్ధిలోమగ్నయైయున్నను ఆమెకు దొరకక అల్పభక్తులు సలుపుస్తోత్రములకు వశుడగునట్టియాతని కరుణయపారమని చెప్పుటనా తరమా! 'త్వాం వినా మేగతిర్నహి' యను వారలకు. 3

మనసు మాటలకందకయెతన
జనుల వెంబడి తిరిగుజాహ్నవి
జనకుడౌ జగదుదరుడీ జగతి జనియించున్!
వినుచు గంగా సుతుని గానము
ఘనమహిము డీతడు ఖచర వా
హనుడు సురులను గూడితిరుగుచునుండు నింటింట 4

వాఙ్మనోవ్యాపారములకతి దూరముగా నున్నను ఎల్లకాలము స్మరించు తనవారల వదలక ననుసరించు దయామయుడు. చేతనులకు స్థూలదేహమిచ్చి తదంతర్యామియై యున్నందున జనియించుట యని ఉపచారార్థ

ముచెప్పవలెను జగత్తునే తన పొట్టలో ధరించి భీష్ముని స్తోత్రము విని సంతసించు మహామహిముడగు శ్రీహరి గురుడవాహనుడై ఇంటింట సంచరించునని తాత్పర్యము. 4

పంచుకొని సుప్రీతి పొడుచు
నుండ గూర్చుండి వినునిలు
చుండి పాడగ నలరునలరగ వచ్చుతుమిమ్మనెడున్।
ఉండు వశుడై సులభుడీహరి
యొండు నిమిషము తనజనుల విడు
వండు కుజనులు సేవజేయక చెడుదురీ భవమందున్। 5

శ్రీపరమాత్ముని ధ్యానగానములకు కాలనేమము లేదను భావముతో వర్ణింతురు బృహన్నారదీయ పూరాణము ఏకాదశి మహాత్మ్యమందు‒యః స్వపిత్వాతు శయనె హరించింతయతెనరః। సహరి కీర్తనం తస్యసంతిష్ఠన్ శ్రుణుతే సదా।యస్తిష్ఠన్ కీర్తయేద్దేవం భక్త్యాయుక్తో నరోత్తమః।స్వయముత్థాయ దేవేశో భక్తస్య శ్రుణుతెస్తవం! యః సముత్థాయ మతిమాన్ జగదాధార మీశ్వరం కీర్తయేద్వివిధైర్గీతైః।మహాభక్తిసమన్వితైః సహరిః శ్రుణుతె స్తోత్రం నృత్యమానోతిహర్షితః॥యః పుమాన్నృత్యమానః సన్ విలజ్జోగీయతెయది. సహరిః పరమ ప్రీతో ప్రత్యక్షో భవతి ధ్రువం॥ అనుదానినే దాసులవారీపద్యమున వర్ణించిరి. అనన్యచేతాః సతతంయో మాంస్మరతి నిత్యశః। తస్యాహం సులభః పార్థ, అని భగవద్గీతలో చెప్పినట్లు శ్రీహరి సులభుడైనందున, మంచము పైకూర్చునిస్తుతించిన భీష్ముని శ్రీపతి కూర్చుండివినెను పిత్రంతర్గత శ్రీహరిని పుండరీకుడు కూర్చుని స్తుతించిన శ్రీశుడునిలుచుండి వినెను‒నిలుచునిస్తుతించిన ప్రహ్లాదునికై స్తంభము నుండి నర్తించుచువచ్చెననియు, నర్తించు నారదునికి ప్రత్యక్షమయ్యెననియు పెద్దలు చెప్పుదురు. ఇట్టి శ్రీహరిని భజించకపామరులు గోరమైనసంసారాబ్ధిలో మునుగుదురు. 5

మనసునను తానుండు తామన
సనగబడు తామనోవృత్తుల
కనుగుణముగా భోగముల నిడు త్రివిధ జీవులకున్।
మనసు నిచ్చిన తనన యిచ్చును
తనువు వంచుచు దినదినము సా
ధనము సల్పెడువారికిడు స్వర్గాది భోగములన్।  6

సకల సాధనములందు ఇంద్రియ జయమే గొప్పది. అందులో మనో
జయము చాలా కఠినము. ఇట్టి మనసును శ్రీహరి పాదారవిందములందు
భృంగమువలె భావించువారలకు సద్గతిని ప్రసాదించునని చెప్పుటకై
మనసునను అని చెప్పుచున్నారు. మనసులోనున్న పరమాత్మ మనస్సనియే
పిలువబడుననుటకు "తత్త్వద్వస్తుషు సర్వేషు తత్తదాకారతఃస్థితః। తత్రతచ్ఛ
బ్దైశ్చ భగవాన్ ప్రోచ్యతె నిజశక్తితః॥ ఒళ్ళు వంచి వ్రతాదులచే సాధనము
చేయువారికి స్వర్గాదిలోకములందు సుఖములనే యిచ్చును.'' న యజ్ఞా
నచ తీర్థాని నోపవాస వ్రతానిచ। దైవతాని చ సర్వాణిత్రాతుంతం శక్నుయుః
క్వచిత్॥ '' అను తంత్రసారములో చెప్పినట్లు హరిభక్తి లేని వానికి
మోక్షమునిచ్చి రక్షించదు, కావున మనః పూర్వకముగా సాధనము చేయ
వలెనని భావము.  6

పరమ సత్పురుషార్థరూపుడు
హరియె జగమున కంచు పరమా
దరముపాసనము సల్పిన వారలకు వశుడగును.
మరచి ధర్మార్థముల గోరెడు
నరులకున్ చెచ్చెరను నవ్వుచు
సురపతనయ సుయోధనునకిచ్చిన యటులనిచ్చున్.  7

"సకామాద్ద్విగుణా ప్రోక్తా అకామైసుకృతా క్రియా" అను తంత్రసారోక్తి
ననుసరించియు, ''మయ్యర్పితచిత్త వృత్తిః అను విష్ణు రహస్యము

ననుసరించియు నిష్కామోపాసనతో శ్రీహరి కర్పిత మనోవృత్తిగల పురుషు నకు మోక్షము నిచ్చు వాడనియు, తనను మరచి ధర్మార్థములను గోరువారికి నశ్వర ఫలము నిచ్చువాడనియు జూపటకై - ఇంద్రకుమారుడగు నర్జును నకు దుర్యోధనులకును యిచ్చినట్లు ఫలములనిచ్చునని భావము. 7

జగము సృష్టించు నితడే నాల్
మొగము వేల్పునసుండి గాచును
గగన కేశునియందు నిల్చుని చంపులోకములన్-
స్వగతభేద వివర్జితుడు స
ర్వగ సదానందైకదేహుడు
అగణితాహ్వయుడౌను భక్తులగాచు నెల్లపుడున్. 8

నాల్మొగమువేల్పు బ్రహ్మదేవునియందుండి సృష్టించుచు, తానే రక్షించుచు, గగనకేశునియందు రుద్రునియందుండి లోకముల సంహరించును. ''ఆవిష్టరూపౌ విజ్ఞేయౌ (విష్ణుఃసర్వస్య కారణం,) బ్రహ్మరుద్రాభిధాయకౌ! స్కందపురాణము ప్రకారము ముఖ్యకర్త శ్రీశుడే తనయందు భేదములేనివాడై సదానంద శరీరుడై అగణి తుడనబడి ఎల్లప్పుడు భక్తుల సంరక్షించును. 8

ఒకని తోడుగ నాడుకొను వే
రొకని జూచుచు వేడుకొను వే
రొకని కిచ్చును మాటలాడును చకితుడైనట్లున్
ప్రకటముగ పెనుదైవ మీతం
డొకరినైనను లెక్కసేయం
డొకడెభువితా బాధ్యబాధకుడగును నిర్భయుడు. 9

ఒకరిలోతానే నిలిచి ఆటలాడును. వేరొకనిలోనుండి చూచును. ఒకనిలో నుండి వేడుకొనును. వేరొకనికి ఇచ్చును. ఇంకొకనిలో నుండి ఆశ్చర్య

పడుచు మాటలాడును. దేవతా శ్రేష్ఠుడైన ఈతడు ఎవనినైనను లెక్క చేయడు నిర్భయుడుగాన లోకమున తానొక్కడే బాధ్యుడు మరియు బాధకుడును అయియున్నాడు. 9

శరణజనమందార శాశ్వత
కరుణి। కమలాకాంత కామద
పరమపావనతర, సుమంగళ చరిత। పార్థసఖా।
నిరుపమానందాత్మ నిర్గత
దురిత దేవవరేణ్య। యనుచా
దరమునం బిల్వగనె జేరును వచ్చి తనవారిన్. 10

"శరణుజొచ్చినవారికి కల్ప వృక్షము వంటివాడా! ఓ లక్ష్మీపతి కోరిన దిచ్చువాడా! పావనుడా! దురితదూరా! కల్యాణకారీ అర్జునునికి సఖుడా। సాటిలేని ఆనంద స్వరూపుడా। దేవశ్రేష్ఠ." అని భక్తితో పిలువగనే తన భక్తుల దగ్గరకువచ్చి వారిని రక్షించును. 10

జనని గానకయున్న బాలుడు
కనలి తలచుచు నేడ్వచీకటి
గనగరానటువంటి వానినిజూచి నవ్వుచును.
తనయునిన్ బిగి కౌగిలినిగొని
కనలికను బాపినటు మధుసూ
దనుడు తనవారెందు నున్ననువచ్చి రక్షించున్. 11

అనన్య భావమున స్తుతించిన అవశ్యముగా వచ్చి సంరక్షించునని గట్టిగా "తల్లి కుమారుల వాత్సల్యము నుదహరించి వర్ణింతురు. భావము సులభము. 11

ఇటుకరాతిని భక్తి నొసగిన
చటుల భక్తున కాత్మనిచ్చియు
నటుకు లిచ్చిన పేదవిప్రునకిచ్చె సఖిలార్థములన్.
కుటిల వచనములనిన చైద్యున
కటులె పొట్టలో శరము దూర్చుచు
జటిల భీష్మునియెడ గుణములెంచెనె దయాజలధి. 12

పుండలీకుడను భక్తుడు ఆసనముగానొక ఇటుక నీయగా నతని భక్తికి మెచ్చుకొని, కుచేలుడిచ్చిన అటుకుల అల్ప పూజలకు మెచ్చుకొని వారికి సద్గతిని ప్రసాదించెను. దుర్భాషలాడిన చైద్యునకు తనలోస్థాన మిచ్చెను. మరియు శరపంజరమున నున్న భీష్మాచార్యుల దుర్గుణములను చూడక సద్గతిని ప్రసాదించిన పరమ దయాసాంద్రుడీతడు. 12

ధనము సంరక్షించు ఫణితా
దినకయున్ వేరొకరికీయక
ధనము జూచుచు సంతసించినయట్లు శ్రీపతియున్
ప్రణతులను గాచుచునునిష్కా
మనుడు నిత్యానందుడై దు
ర్జనుల పూజల నొల్లడ ప్రతి మల్లుడీ జగతిన్. 13

ధనము గాచుచున్నపాము తానుదినకయు ఇతరులకు ముట్టనీయకయు ఎల్లప్పుడుగాచుచు సంతసించుచున్నట్లు శ్రీదేవికి ప్రియుడైన శ్రీహరితన భక్తులతో నేమియు గోరక రక్షించును. నిత్యానందరూపియై ప్రపంచమందున సాటిలేని పరాక్రమియైన పరమాత్మ దుర్మార్గులు చేయు సేవల స్వీకరింపడు. 13

బాలురాడెడు చిలిపి పలుకుల
నాలకించి సుఖించు తల్లిని
బోలు శ్రీహరి స్వీయజననుతి వినుచు హర్షించున్
తాళజాలడతండు నిజజన
హేళనము కడు పెద్దవిదురుని
యాలయమున బాల్ద్రావి కురుపతి మానమును దీసెన్. 14

భక్తిరసము నిండిన హృదయముతో సామాన్య వచనములతో స్తుతించినను శ్రీహరి తన శిశువుల చిలిపిపలుకులకు తల్లి సంతోషించునట్లు సంతసించును తన భక్తుల కగు నవమానముల నీతడు సహింపజాలడు కావుననే విదురునింటిలో పాలుత్రాగి దుర్యోధను నవమాన పరచెను ఇతడు సర్వోత్తముడు. 14

స్మరణ జేసెడివారి తప్పుల
స్మరణ జేయకభీష్ట మిచ్చును
మరల తన కర్పించుదాని ననంతముగజేసి.
పరిపరిని తిన్పించి సుఖసా
గరమునన్ దేలించు మంగళ
చరితుడు సచ్చిదానంద గాత్రుడు సుజన సఖుడు. 15

తనను భక్తితో దలచునట్టి భక్తుల అపరాధమును క్షమించుచు వారి కోర్కెల దీర్చుచుండును మరియు తన కర్పించిన కర్మ ఫలములనే అనంతముగా పెంచితాను భుజించి అర్పించిన వానికి భుజింపజేసి వారిని ఆనంద సముద్రములో నోలలాడజేయును జ్ఞానానందైకదేహము గలవాడై సుజనుల రక్షించుపరమపావనుడు, 15

ఎట్టి కరుణానిధియొ హరి తా
నెట్టి భక్తాధీనుడో తా
నెట్టి దీతని లీల తన యిష్టమున నీ జగమున్.
పుట్టునిచ్చును గాచు చంపుచు
జెట్టు నిర్వాణాది చోటుల
నట్టె వారల నెప్పుడును సుఖమిచ్చుచుండున్. 16

శ్రీహరి కరుణ అసాధారణమైనదని జీవుల నుండి స్వామికెట్టి యుపకారము లేకున్నను దేహములనిచ్చి సాధనము జేయించి మోక్షాద్యఖిల పురుషార్థములనిచ్చి వారల కెప్పుడును ఆనందము నిచ్చుచుండును. 16

జనపతికి దయగలుగ ధనవా
హన విభూషణ భూము లిచ్చును
తను మనము లిడి యాదరించెడి వారలెవ్వరీ జగతిన్ —
అనుదినము దలపగననంతా
సనము మొదలగు నాలయంబుల
నునిచి, శిశువలె వారివశుడగు దివ్య మహిముండు. 17

ఇదివరకటి భావమునే దృఢపరచుటకై శ్రీహరి యొక్క కారుణ్యమును విశదపరచుచున్నారు జనప — యనుపద్యముతో — దొరకు దయగలిగినవారి ధనమును వాహనములను, అలంకారసాధనములను, భూమినిఇయగలడు కాని శరీరమును మనస్సును యిచ్చి ఆదరించు వారెవరు? ఎల్లప్పుడు తనను దలచువారలను సంసార బంధమోచనము చేయించి స్వర్గాది సుఖములనిచ్చి శిశువువలె వశుడైపోవునట్టి మహా మహిముడీ లోకములో నెక్కడనైనను దొరకగలరా? 17

భువన పావన చరితపుణ్య
శ్రవణ కీర్తన పాపనాశన
కవి వినుత నిస్సీముడుత్పలదళనీల దేహుండు.
యువతి వేషముతోన గౌరీ
ధవుని మోహితుజేసి కాచిన
భువన మొహకుడితని మాయను గెల్వగలడెవడు. 18

లోకమును పవిత్రమొనరించువాడు, శ్రవణము అను భక్తికీర్తన యను భక్తి జేసినవారికి పాపముల నశింపజేసి పుణ్యమునిచ్చువాడు, నీలకమలదళమును బోలునీల శరీరము గలవాడు పూర్వము సముద్ర మంధన సమయమున మోహినీ వేషముతో పార్వతీ పతియగు శంకరుని మోహింపజేసి మరల యాతని ననుగ్రహింపేను బ్రహ్మాది దేవతల పొగడ్తలనందు కొనుచులోకమును మొహింపజేయు నీతని మాయనెవడును గెల్వ జాలడు. 18

పాప కర్ముల సైఁగల ల
క్ష్మీ పతికి సరియైన దివిజుల
నీ పయోజభవాండమున నే గాన నెచ్చటను.
గోపగురువు పదంతి భృగునగ
చాపులాదిగ జేసినట్టి మ
హాపరాధము లెంచెనేమి దయాబ్ధి మాధవుడు. 19

భక్తుల వలన ఘటించిన గోరాపరాధముల నెంతమాత్రము లెక్కసేయక రక్షించునట్టి శ్రీపతి దయ అసాధారణమైనదని ఈ పద్యములో విశదపరచుచున్నారు. - స్వర్గమును పాలించు దేవేంద్రుడు గౌతమునందు

కామధేనువు కల్పతరు చిం
తామణులు సురలోకముననే
యేమి గోరిన దెల్ల నిచ్చును గొల్చువారలకే
శ్రీ ముకుందుని పరమ మంగళ
నామమిది నరకస్థుల గాచె
పామరుల ప్రాజ్ఞుల జేసి పురుషార్థములిచ్చెన్ 21

వ్యా - కామధెను కల్పవృక్ష చింతామణులు దేవలోక మందుండును అవి కేవలము తమనారాధించు వారి కోర్కెలను దీర్చును. కాని హరినామ మట్టిది కాదు. ఒకప్పుడు నారద మునీంద్రుడు మహతియను తన వీణను మీటుచు హరినామ సంకీర్తనము జేయుచు పోవుచున్నపుడు అది నరకములో మ్రగ్గుచున్న వారి చెవులలో పడగనే వారు తమ యాతనా శరీరమును వదలి పాపముక్తులై పోయిరని బ్రహ్మాండ పురాణములో గలదు. కావున హరినామము పామరులను పండితులుగా జేసి వారికి మోక్షాది పురుషార్థము లిచ్చునని భావము. 21

మనసుననను సుందర పదార్థము
ననయు మిడ గైకొంచు బహు సూ
తనము దనరెడు గంధ సురసోపేత ఫలములను
ద్యునది నివహములట్టు లిడవా
రిని సుఖాబ్ధిని దేల్చి తత్ స
ద్గుణము గొనివారియఘముల బాపుననఘుండై 22

అతివృష్టి కురిపించిన అపరాధము గురుపడంతి రామావతారమందు గురువగు తండ్రియగు దశరథ మహారాజు భార్యకైకేయి తన పట్టాభిషేకము నకు విఘ్నముచేసిన అపరాధము నంద గోపుని భార్య (గురుభార్యయే యగును) యశోదాదేవి తనను శిక్షించినట్టి అపరాధమును లేదా శ్రీకృష్ణుడు గురుకుల మందున్నప్పుడు గురువగు సాందీపని పత్నిని అడవికి పంపి కట్టెలు మొదలైనవి తెప్పించిన అపరాధము మరియు భృగుముని తం వక్షస్థలము నకు పాదాఘాతముజేసిన అపరాధము నగచాప అనగా త్రిపురాసుర సంహార కాలమందు బ్రహ్మను సారథిగా జేసికొని శ్రీహరినే బాణముగా జేసుకొని మేరుపర్వతమును ధనుసుగాజేసుకొనినట్టి రుద్రదేవుడు సృష్టికాల మందు దేవుని తోనవే యుద్ధము జేసెనను భావము విజయరాయల సుళాదిలో చెప్పియున్నారు ఇత్యాది అపరాధములను క్షమించి పాలించినట్టి దయా సముద్రుడీతడని తాత్పర్యము. 19

పటు పదాంగుళి జనించిన సుర
తటిని తూడ్చును భువనముల యఘ
పటల మవ్యాకృతాకాశాంతమున వ్యాప్తిన్.
జటుల సాగర పుత్రి కధిపతి
దిటవు సంగోపాంగ గతుడౌ
పటు సుమంగళదాయి నామముగాచుటరుదే ? 20

పరమాత్మ పాదాంగష్టము నుండి జనించిన సురతటిని అనగ భాగీరథి ముల్లోకముల పాపముల పోగొట్టుటలో సమర్థురాలైనపుడు ఆమె తండ్రియగు శ్రీహరి పాపనాశనమూ జేయుట ఏ మాశ్చర్యము? శ్రీ భాగమూనందున్న అకాశాంతమూ వ్యాపించిన ఆ శ్రీహరి మంగళ దాయియగు నామము స్మరించుటతో అందరిని పవిత్రము చేయగలుగుట ఆశ్చర్యం కాదని భావము 20

చేతన జడ విలక్షణుడు తా
నూతన పదార్థములలోన నతి
నూతను డందమున కందము రసమునకు రసుడై
జాతరూపోదర భవాదుల
నాతత ప్రతిమ పభావుడు
భూతళంబున మన తోడనాడును గాదె మన తండ్రి 23

జడ జీవులందు భిన్నత్వేన వ్యాప్తుడైనను నిర్లిప్తుడై యుండునని విశద పరచుచున్నారు. జడ జీవులకు భిన్నుడై కొత్త వస్తువుల కన్నను కొత్త వాడై సుందరులలో సుందరుడై రసములలో రస స్వరూపుడై బ్రహ్మరుద్రాదులలో వ్యాప్తుడై అసమాన మహిమగల మన పితృరూపుడైన శ్రీహరి ఈ భూమండలము నందు మనతో నుండి ఆడుచుండును. 23

తల్లిదండ్రులు స్వీయ శిశువుల
కెల్ల భీతిని దుడిచి తమ దగు
నిల్లు చెల్లగ జేసి కోర్కెల దీర్చు నైవడిని
తొల్లి నేడును వెనుక ముందుగ
నల్ల కుడి యేడమ బైటయు
నెల్లెడల నాకసమువలె గాపాడు తన వారిన్. 24

"చక్రవ్యగ్రిత: సహ గదో హరిరస్తు పశ్చాత్తత్పార్శ్వయోర్ధనురసీ మధుహాజనశ్చ" "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థిత" అను ప్రమాణానుసారముగా తల్లిదండ్రులు తమ బిడ్డలకు గలిగిన భయమును పోగొట్టి వారడిగిన దానినిచ్చి ఇంటిలో ఉంచడించునట్లు తన భక్తుల నిందిరాపతి వెనుక ముందర. కుడి యెడమను లోన బైటను, ఆకసమువలె ఎటు జూచినను రక్షించుచుండును 24

ఒడలి నీడను బోలి హరి మా
యొడనె దిరుగుచు నొక్క త్రుటియును
విడువ జాలక యుండు భక్తాధీనుడన బరగి,
తడయు దురితాఘముల కామదు
డిడును సకలేష్టముల సతతము
నడచు మనవలె నవవిశిష్ట మహామహిముడతడు 25

కొత్త దనముతో విశిష్ట మహా మహిమగల శ్రీహరి భక్తాధీనుడై మన నీడవలె ఒక క్షణకాలము గూడ విడువక మనల వెంబడించుచుండును. మన బాధలను పోగొట్టుచు మనము కోరిన దెల్లయు నిచ్చును. మరియు మనవలెనే ఎల్లకాలము నడచుచుండును,

విడిచిపెట్టిన వారి భవమున
ముడిని బెట్టును బహు కఠిణుడీ
తడును శ్రేష్టుడని నమ్ముచు భక్తి పాశమునన్
ముడి యిడెడి వారి భవపాశము
విడువ జేయును కోపి కాడిత
డిడును సౌఖ్యము గోర్కె దీర్చుచు నిహపరంబులను 26

తనను వదలుకొన్న వారిని సంసారమను పగ్గముతో బిగించును, తనను భక్తిపాశము నుండి బిగించు వారిని సంసార బంధము నుండి విముక్తి కలిగించును, ఇతడెంత మాత్రము కోపిష్టి కాడు—భక్తులు కోరిన కోర్కెల దీర్చి యిహపరములలో పరమ సుఖమును ప్రసాదించును

కంటిరెప్పలవోలె నవ్వకు
నంటు హస్తము వోలె పండ్లవి
వెంట నమలుచు పండ్లరసమును నాల్కకడునట్లున్.
వెంట నత్వలమిడు కనుడిలువ
కంటి పతియండమును లక్ష్మణు
దొంటివాడరుదెంచు భక్తుల వేళ కమరులతోన్. 27

పండ్లు—అవి = దంతములు, నుడి కలువ కంటిపతి మండము = బ్రహ్మండము, లక్ష్మణుదొంటి వాడు శ్రీరాముడు. కన్నులను రెప్పలు రక్షించునట్లు, శరీరముపై గలుగు నవ్వకు చేతులు పరుగిడునట్లు, పండ్లను బాగుగా మెత్తజేసి నాలుకకు రసము నందజేయునట్లును ఈ బ్రహ్మాండములో శ్రీరామ చంద్రుడు తన భక్తుల ఆపత్సమయమునకు దేవగణముతో సహా వచ్చి పుణ్య ఫలముల నిచ్చును. 27

ఇచ్చునది గైకొను నరక్షణ
మెచ్చుటను తనవారి విడువక
హెచ్చు దురితము మాడ్చు ఘన దురితవన పావకుడు.
వెచ్చు గిరి తన వీపు మోపిన
వచ్చెనే యాతనికి కోపము
మెచ్చి యమృతము నిచ్చె సురులకు గూల్చె దానవులన్. 28

పాపమను నడవికి కార్చిచ్చువలెను శ్రీహరి భక్తులిచ్చిన దానిని స్వీకరించును, అరక్షణమైనను వారిని వదలి యుండ జాలడు మరియు వారి కష్టముల పరిహరింపసునే ముందును అమృతము మంధన మప్పుడు తన వీపుపై మందర పర్వతమును మోపగా నతనికి కోపము వచ్చెనా? కష్టములోనున్న దేవతలకు అమృతము నిచ్చి దైత్యులను సంహరించెను 28

ఖేద మోద జయాప జయముల
నేది దోషము లేదు చిన్మయు
నాదరమ్మున తనదు పాదము నమ్మి నుతియింపన్.
మోదమిడి కాపాడు కరుణాం
భోధి తనవారు సల్పి నప
రాధముల జూడక గాచును సర్వకామదుడు 29

చిన్మయుడైన శ్రీహరికి దుఃఖ సుఖములు, జయాపజయములు మొదలగు నేదోషమును లేదు తన పాదముల నమ్మి ఎల్లప్పుడు స్తుతించు వారిని కాపాడును. కావుననే యితడత్యంత కరుణాశాలి కోరినదాని నిచ్చునట్టి వాడు మరియు భక్తులపరాధముల నెన్నక రక్షించువాడు 29

మీన కూర్మ వరాహ నరపం
చాన నాతుళ శౌర్య వామన
రేణుకాత్మ రావణారి నిశాచరధ్వంసి.
ధేనుకాసుర మథన త్రిపురుని
హాని జేసినవాడు కలిముఖ
దానవుల బరిమార్చి ధర్మము గాచె సజ్జనులన్ 30

శ్రీహరి దశావతారములిందు స్తుతింపబడినవి, మీన కూర్మవరహావ తారము అసమాన శౌర్యసంపన్నుడైన శ్రీనార సింహుడు వామన మూర్తియు, రేణుకాదేవి కుమారుడగు పరశురాముడును, రాక్షస సంహారియైన శ్రీరామ చంద్రుడును, ధేనుకాసురుని చంపిన శ్రీ కృష్ణుడును, త్రిపురవాసి, దానవ స్త్రీల వ్రత భంగము జేసిన బౌద్ధుడును మిగుల బుద్ధిశాలియగు కల్కి మొదలగు దైత్యుల హతమార్చి ధర్మమునుద్ధరించు కల్కియును సజ్జనుల సంరక్షించును 30

శ్రీ మనోరమ శమల వర్జిత
కామితప్రద కైరవదళ
శ్యామ శబల శరణ్య శాశ్వత శర్కరాక్ష సఖ.
సామ సన్నుత సకల గుణగణ
దామ శ్రీ జగన్నాథ విఠలు
డీ మహినవతరించుచు గాచె సకల సజ్జనులన్ 31

క్రమముగా—దోషరహితుడు కోరిన దానినిచ్చువాడును, శ్యామవర్ణను కోరి నిచ్చువాడును దేవతల స్నేహితుడును సామవేదము తో పొగడబడువాడును సకల సద్గుణముల కధిష్ఠాన భూతుడు అయిన శ్రీ జగన్నాథ విఠలుడు ఈ భూమి యందవతరించి సజ్జనుల గాపాడెను 31

:— కరుణా సంధి సమాప్తము :—





# శ్రీ మధ్వాంధ్ర హరి కథామృతసారము

## -: 3వ వ్యాప్తి సంధి :-

హరికథామృత సారమును గురు
కరుణతో నిటు నేను చెప్పెద
పరమ భగవద్భక్తులిది యాదరమున వినుండు. (పల్లవి)

పురుష రూపత్రయ పురాతన
పురుష పురుషోత్తమ క్షరాక్షర
పురుష పూజిత పాద పూర్ణానంద జ్ఞానమయ.
పురుష సూక్త సుమేయ తత్త
త్పురుష హృత్పుష్కర నిలయ మహా
పురుష జాండములోన బైటను వ్యాప్త నిర్లిప్త. 1

పరమాత్ముడు సర్వత్ర సంపూర్ణముగా వ్యాపించి యున్నాడు ఆతడు లేని స్థళమే లేదని శ్రీ జగన్నాథ దాసులవారు ఈ సంధిలో నిరూపించుచున్నారు.

శ్రీహరి సృష్టికాలములో మూడు పురుష రూపములను ధరించును మరియు పురాణ పురుషుడు? బ్రహ్మాది జీవులు క్షర పురుషులనియు, లక్ష్మీదేవి అక్షర పురుష యనియు చెప్పబడినది. " బ్రహ్మ శివ సురేశాద్యాః శరీర క్షరణాత్ క్షరా! లక్ష్మి రక్షర దేహత్వా దక్షరాత్పరతో హరిః యని తత్వ నిర్ణయము చెప్పుచున్నది. ఈ విధముగు పురుషులచే భూజింపబడు పాదములు గలవాడు అనంద జ్ఞానములే స్వరూప దేహముగా గలవాడా పురుష సూక్తముతో తెలుసుకొనుదగువాడా! ముందుగా జెప్పబడిన పురుషుల హృదయ కమలము నిలయముగా గలవాడా అఖిల బ్రహ్మాండములోనను బయటను వ్యాపించియు నిర్లప్తుడా, " నిర్లిప్తో నిర్వికారశ్చ సదా సర్వత్ర సన్నపి " (సత్తత్వ రత్నమాల") "అసంగోహ్యయం పురుష" ఇతిశ్రుతిః ఇట్టి పురుషుడా యని సంభోధనములు నన్ను రక్షించుమని ( అధ్యాహారము ) అర్ధము చేయవలెను. 1

త్రిగుణములందును త్రిగుణీగనుతా నుండి వానితో బద్ధుడు గాక గుణి మరియు గుణము ననబడును. త్రిగుణాత్మక జీవులును చేయు పాప పుణ్యములను బ్రహ్మ మొదలగు చివరి జీవుల వరకును అందరిలో నుండి వారికి అనుభవింప జేయును వారి పాపములను నశింపజేసి జ్ఞానానంద దేహముగలవాడై ప్రళయ కాలమునందు ప్రపంచమునే మ్రింగి వేయును. తాను మాత్రము నాశరహితుడై యుండును. 5

విద్య తానే యనగబడు నని
రుద్ధ దేవుడు సర్వ జీవుల
బుద్ధిలో నెలకొంచు కృతిపతి బుద్ధి యనబడును.
సిద్ధి యనబడు సంకరుషణ ప్ర
సిద్ధ నామక వాసుదేవు న
వద్య రూప చతుష్టయము తెరిగిన జనుడె బుధుడు. 6

అని రుద్ధుడు 'విద్య, యని పిలువబడును, ప్రద్యుమ్నుడు సకల జీవుల బుద్ధిలో నుండి బుద్ధి, యనియు, సంకర్షణుడు, శుద్ధి, యనియు, వాసుదేవుడు ప్రసిద్ధి యనియు పిలువబడును. ఈ నిర్దష్టములైన నాల్గు రూపములను తెలిసికొనిన వాడే పండితుడు 6

తను చతుష్ట యమందునారా
యణుడు హృత్కమలాఖ్య సింహా
సనము ననిరుద్ధాది రూపులలోన దనరుచునం.
ఘనము తానే సేవ్య సేవక
డనగ సేవా సక్తనుడులం
దన పరతమునందును గొనును సేవల వారిదీరుగనే. 7

ఇపుడు స్వరూప లింగ అనిరుద్ధ స్థూల ఈ నాల్గు దేహములందు అనిరుద్ధాది రూప చతుష్టయముతో నుండి వాయ్వాది తత్త్వేశులందు తనే నిలుచుని, తన సేవ తానే చేసుకొనుచున్నాడని అవతరణిక

తన నాల్గు రూపముల శరీరమందలి హృదయకమలసింహాసనమందు శ్రీమన్నారాయణుడు అనిరుద్ధాది రూపముల తోశోభించుచు సేవ్య సేవకుడు తానేఅయి తనసేవలో తత్పరులైన దేవతలందుండి జీవులవలె సేవల స్వీకరించును. 7

జాగర స్వప్నములలో పర
భోగిశయనుడు పలుదెఱఁగులను
భాగములుగ నిరంశ జీవుల చిచ్ఛరీరమును
భోగమిచ్చి సుషుప్తిలోనను
సాగరము నది గూడునట్లు వి
యోగ రహితులంశములనే కత్రముగ జేయున్ 8

పరమాత్ముడు జాగర స్వప్నములందు అంశరహితులైన జీవుల జ్ఞానరూపదేహమును అనేక విధముగా విభజించి వారికి భోగములనిచ్చి నదులు సముద్రములో గూడునట్లు శ్రీహరి జీవుల అంశములను నిద్రావస్థలో ఒకే స్థానమందు జేర్చును. 8

భారత్యాదులను గూడుకొని కారణ
కార్యవస్తువులందు ప్రేరక
ప్రేరకి రూపుల తోడ పటుతంతువుల వలెనుండి
సూక్ష్మకిరణములట్లు తనదగు
విగ్రహమునసే యిచ్చి కొనుచు న
నాయుక్తులకు నీతని విహారము గోచరంబగునే ? 9

శ్రీభూదుర్గా సహితుడై శ్రీహరి జడ ప్రకృతి జగత్తు మొదలగు వస్తువులందు ప్రేరణజేయుచు, ప్రేరేపించుకొనుచున్న రూపములతో వస్త్రమునందలి దారమువలె సూర్యకిరణములవలె న సామర్థ్యముతోననే జీవులకు పాపపుణ్యములనిచ్చుచు, వారితో సేవలగొనుచుండును. ఇట్టి పరమాత్ముని లీలలజ్ఞులకు దెలియ శక్యము గాదు. 9

జనకుఁడాత్మజునకున్ వర భూ
షణవసనముల దొడిగి తాపం
దనము గైకొని దీవెనల నిడి సంతసించునటుల్
వనరుహాక్షుడు పూజ్యపూజకు
డనగ పూజాసాధనుడునై
తనకు తానై ఫలము లిచ్చును భక్తపరవశుడై 10

తండ్రి తన కొమారునకు మంచి ఆభరణములు మరియు వస్త్రములతో నలంకరించి వానిచే వందనములు గొని దీవించి సంతోషమందునట్లు శ్రీహరి ఒకనియందుండి పూజ్యుడై మరొకనిలో నుండి పూజించుచును తన పూజలకు తానే పూజాసామగ్రిలై భక్తులకు ఫలములిచ్చుచు వశుడగుచున్నాడు. 10

జనకు డతి సంబరముతో నిజ
జనములను రప్పించి లగ్నము
తనయునకు తాజేసి గృహమున నుంచుదీరుగను
వనధిజాధవు డాత్మ సమ్మతి
కనుగుణంబుగ గుణములను చే 11
తనుల కంటించి సుఖదుఃఖాత్మక భవము నుంచున్

తండ్రి చుట్టములను బిలిపించి కడు సంబరముతో కుమారుని పెండ్లి జేసి వాని నింటిలో నుపుంచునట్లు ఇందిరాపతి తన ఇష్టానుసారముగా జీవులను త్రిగుణముల సంబంధము జెయించి సుఖ దుఃఖ సంమిశ్రిత సంసారమందు బెట్టును 11

తృణకృతాలయమందు పొగనిం
డిన తఱిని ఛిద్రముల వెల్వడ
ననలుడున్ గన్పించి కన్పడకున్న రీతిగను
వనజజాండము నిఖిల జీవుల
తనువు లోనను బయటు నుండియు
కనబడకయే కర్మల సలుపు హరి వారివలెనే 12

గడ్డిగప్పిన గుడిసెలలో పొగనిండుకొని ఛిద్రముల గుండ వెలువడి అచట అగ్నియున్నట్లు తెలిపినను బైటికి గానకునట్లు బ్రహ్మాండములోను న్న జీవులంరి శరీరములలోన బైటను ఉండి వారికి కనబడకయే శ్రీహరి అన్ని పాపపుణ్యకర్మలను వారివలెనే చేయుచుండును. 12

పాదపము మొదలంటు నీళ్ళిడి
పాదుకొల్పగ కొమ్మ పువ్వుల
స్వాదు ఫలముల నిచ్చునటు సర్వేశ్వరుడు జనులా
రాధనలు గైకొంచు బ్రహ్మా ఖ
వాదినామము తోడ ఫలమిడి
ఆదరించును జనులకున్ దన మహిమ దెల్పకయే 13

చెట్ల మొదళ్ళకు నీళ్ళు బోసినచో చెట్లుకొమ్మలు పెరిగి పూవు మరియు రసభరితములైన పండ్ల నిచ్చురట్లు జనులు జేయు పూజలను సర్వేశ్వరుడు స్వీకరించి బ్రహ్మాదుల పేర్లతో ఫలములనిచ్చి ఆదరించును కాని తా నాఫలములనిచ్చినట్లు వెల్లడి జేయడు. 13

శ్రుతితతుల వగపడక తాన
ప్రతి మహానందాత్ముడచ్యుతు
పతతు విశ్వాధారు విద్యాదీశు విధిపితయున్
ప్రతి దినము చేతనులలో ప్రా
కృత పురుషులటులనె తిరుగుచుం
సతతు నియమస్థనిమానుషుడై సుఖముల నొసగున్ 14

వేదములకందని యనమాన మహిమగలవాడు, ఉత్పత్తి లేని యానంద స్వరూపుడు, నాశరహితుడు, సర్వత్రవ్యాప్తుడు, ప్రపంచమున కాధారుడు బ్రహ్మదేవుని తండ్రియు, అయిన శ్రీహరి జీవులందరిలో సామాన్యునివలె ఆజ్ఞాధారకునియందు నియమ్యుడు అజ్ఞాపించువానిలో నియామకుడై రక్షించును.

మనసు విషయమున నిడి విషయము
మనసులో నెలకొల్పి యతి నూ
తన మిది మనమెచ్చినదుపాదేయమని దెలిపి
తనపాదముల దలపు కలయం
దున నిడక సర్వాంతర సుఖం
దనుభవించును స్థూల విషయము విశ్వుడనబరగ 15

మనసును సంసారమందుంచి సంసార సుఖములను మనసులో బాగుగా స్థాపించి" ఇవి మిక్కిలి క్రొత్తవి పరిపూర్ణ సంతృప్తి కలుగ జేయు సుఖమునిచ్చునవి,, అని జీవులు నమ్మునట్లు జేసి తన పాద స్మరణము వారికి కలలో గూడ కలుగకుండునట్లు జేసి విశ్వరూపముతో శ్రీహరి స్థూల విషయములను భవించును 15

తోదకుండక గుచు తాచిత్తం
జాది కరణములుండి విషయము
నాడుకొను నిజస్ఫూర్తి సుఖముయ గ్రాహ్యగ్రాహకుడు
వేద వేద్యుడు తెలియ సఖ్ఖుల
తా దినుచు నెల్లరియుండు నా
హ్లాద మందును భక్తవత్సలుడు భాగ్యయుతుడు 16

ప్రాజ్ఞానంద స్వరూపుడైన శ్రీహరి తానే ప్రేరకుడై మనస్సు మొదలగు నింద్రియములలో నుండి లౌకిక సుఖముననుభవించును- భాగ్యసంపన్నుడైన ఇతడు తానే ఇచ్చి పుచ్చుకొనుచు తెలియనివానివలె వారివారి దేహగత సుఖముననుభవించుచు అందరియందుండి సుఖించుచుండును 16

నిత్య నిగమాతీత నిర్గుణ
భృత్యవత్సల భయవినాశన
సత్యకామ శరణ్య శ్యామల కోమలాంగ సుఖీ.
మత్తుపటు నరులందు బైటను
మొత్త మన్నిట చుట్టుచునుండు
సత్యధిక సంతృప్తుం త్రిజగద్వ్యాప్త పరమాప్తు. 17

శాశ్వతుడును, వేదముల కందనివాడును త్రిగుణ శూన్యుడును, భయ పరిహారకుడు సత్యమైన అపేక్ష గలవాడు మొరబెట్టుకొనుటకు తగిన వాడు శ్యామల వర్ణముగల మృదు శరీరముగలవాడు ఎల్లకాలము సుఖించు వాడును ఇతరుల భయమెంత మాత్రము లేనివాడై తిరుగుచు జీవులలోనను బైటను ఎటు జూచిన నటు చుట్టుచుండును త్రిజగద్వ్యాప్తుడై భక్తులకు పరమాప్తుడై యున్నాడు.

పవిహరిన్మణి విద్రుమ లస
చ్ఛవుల వలె శోభించుచును మా
ధవుడు సతతము దేవనర దానవులలో నుండి
త్రివిధ గుణకర్మ స్వభావము
పవనముఖ దేవాంతరాత్ముడు
దివస దివసము వ్యక్తమొనర్చు చుండితిని పించు 18

పవి = వజ్రము, హరిన్మణి = ఇంద్రనీలము విద్రుమ—పగడము ల శ్రేష్ఠమైన కాంతివలె వెలయుచు మాధవుడు ఎల్లప్పుడును దేవ దానవ మానవులలో నివసించి మూడు విధములైన గుణ కర్మలను వాయువే మొదలైన దేవతల అంతర్యామియై వ్యక్తపరచుచు వారికనుభవింప జేయును

అణు మహత్తుల నుండు ఘనపర
మాణువందున దాచు సూక్ష్మము
మునుగ జేయుచు స్థూలముల దేల్చునిది యతని మాయ.
వనుజ రక్కసు లందరీ తని
కినిసి చేయునదేమి రోకలి
యెనయ ధాన్యము రోట దంచినయటు దునుమాడున్. 19

కమలా కాంతుని అఘటిత ఘటనా సామర్థ్యము వర్ణింతురు. మిగుల చిన్న దాని యందును మిక్కిలి గొప్ప దాని యందును ఇతడుండును. పెద్ద దానిని చిన్నదాని యందు నుంచగలడు. మిగుల తేలికయైన దానిని నీటిలో ముంచగలడు అతి బరువు గల దానిని తేల్చగలడు. ఇదే ఈతని మాయ దైత్యులీతని ఎదురించి ఏమి జేయగలరు? ధాన్యాయద్యత్ ఖలగాని మర్త్యో సంచూర్ణయిష్యామ్యహ మేక ఏవ అను బ్రహ్మాండపురాణములోని భాగవద్వాక్యము నాచార్యులు దశమ స్కంధ భాగవతతాత్పర్యములో జెప్పినట్లు రోటిలో ధాన్యము వేసి రోకటితో దంచి పొట్టు విడదీసినట్లు పరమాత్మ దేహమును నశింపజేసి జీవులను రక్షించును.

దేవ ధానవ మానవులు నను
నీ విధంబుగ నెపుడు నుందురు
లేవు స్నేహము పగయు దాసీనము లెవరియందున్.
జీవులది కారానుసారము
నీవి సుఖ సంసార దుఃఖము
లేవి తా దినక యిడు వారికి నిర్గతాశనుడు. 20

దేవతలు మనుష్యులు దైత్యులు అను త్రివిధ జీవులు ఎల్లకాలము నను ఉందురు. వీరెవరియందును స్నేహము గాని ఉదాసీనత గాని ద్వేషం గాని యితడు చూపడు అయితె జీవుల యోగ్యతల ననుసరించి దేవతలకు సుఖమును మానవులకు సాంసారిక దుఃఖమును దానవులకు కేవల దుంఖమును తాను అనుభవించక వారికే యిచ్చుచుండును అతనికి భోగమవసరం లేదు

ఎచట విన్న మరెచట జూచిన
నెచట వేడిన నెచట నిచ్చిన
నెచట జారిన నెచట నాడిన నచట మనుచుండున్.
ప్రచుర విజ్ఞులలోన విజ్ఞుం
డెచట సరి యీతనికి నెవ్వం
డచలు డీతడు క్షుద్ర మనుజుల నొల్లడీ జగతిన్. 21

హరి కథల వినుచోట హరి విగ్రహము జూచుచోట ఏ దేవతల లైనను వరము వేడుకొను చోట, ఆయా దేవతలు వరముల నిచ్చుచోట ఎచటికి వకగెత్తినను, ఆడుకొనినను, శ్రీహరి నెలకొనియుండును జ్ఞానులందరి కన్నను ఇతడు ఎక్కువ జ్ఞాని దుర్మార్గులను ఇతడు తిరస్కరించును జగదేక శూరుడె చలుడు అను పదము అసమానుడు అను అర్థము దాసులవి. 21

తప్తలోహము చూచు వారికి
సప్త జిహ్వుని తెఱగు గన్పడు
లుప్తపావక లోహ మగపడు పూర్వమున్నటులన్.
సప్తవాహను డఖిల జనముల
వాప్యుడైనందుననె యందరు
నాప్తులగుదురు సర్వకాలము హితము జేయుచును. 22

తప్త లోహము = ఎఱ్ఱగా కాగిన ఇనుము, సప్త జిహ్వుని తెఱగు = అగ్నివలె కనబడును. లుప్త లోహము = అగ్ని ఆరిపోయిన తర్వాతి ఇనుము నిజరూపమునే పొందును. ఆదే విధముగ సప్త వాహ మడని శ్రీహరికి పేరు " ఏకోఽవహతి సప్తనామ యని శ్రుతిగలదు ఇట్టి శ్రీహరి అంతరియుండును. వాప్తుడైయున్నందున పతి పత్నీసుతులె మొదలైన బంధువులై ఎల్లకాలము హితమాచరించుచుందురు. 22

వారిదము గుఱిపింప బంకేన
భూరుహంబుల వివిధ ఫలములు
వేరువేరైనట్లు పలువిధ జీవులందుండి.
శ్రీరమాపతి వారియోగ్యత
మీరనీయక కర్మగుణముల
తీరు సాగగ జేయు దేవుని కేక పక్షమతలు 23

వైషమ్య నైర్ఘృణ్యములు శ్రీహరికి లేవు. జీవుల స్వభావాను సార ముగా కర్మలను జేయించునని దృష్టాంతముతో చెప్పుచున్నారు మేఘములు వాన గుఱిపింపగా చెట్టుపెరిగి పలు విధములైన రసములనిచ్చు వివిధ ఫల ముల నిచ్చునట్లు లక్ష్మీపతి వివిధ జీవులలో నుండి వారి కర్మలననుసరించి వారి వారి యోగ్యతల కనుగుణముగా ఫలముల నిచ్చి నడిపించును కాని ఆతనికి బేద భావము లేదు. 23

వారిజాప్తుని కాంతి, మణులను
జేరి యాయా వర్ణములను వి
కారిమొందింప కాయ జూపరుల కగపడునట్లున్.
మారరమణుడి ముల్లోకమున
మూరు విధముల జీవులందు వి
హారము సల్పుత ద్యోగ్యతకర్మకను గుణమున్, 24

సూర్య కిరణములు వజ్రమే మొదలగు మణులపై బడి ఆయా రాళ్ళ వన్నెలను వికార మందనీయక చూచు వారికి కగపడునట్లు లక్ష్మీపతి ముల్లోక మందలి మూడు విధములగు జీవరాశిలో నుండి వారి వారి కర్మ మరియు యోగ్యతల కనుగుణముగా విహారము చేయుచుండును 24

జలము మున్గిన ఘటిక పాత్రను
దొలగ జేయుచు గంట చేతను
సులభముగ వాయించు నట్టుల తాననుచున్
హల ధరానుజు డనుచు సుకృత[illegible]
ఫలములను తా దేవదైత్యుల
కలి విభాగము జేసి తినిపించు సాక్షిగ తాననుచున్ 25

తనలో నీరు నింపుకొని మున్గిన ఘటిక పాత్రను వదలి గంట చేత బట్టి లాగుకొని బట్టి వాయించునట్లు బల్లిపట్టియు తనే కర్తయైన బలరాముని దమ్ముడగు శ్రీకృష్ణుడు పుణ్య పాపములను (ఛందస్సులో పాప పుణ్యములని బడినది. ఛందో భంగ భయముగా వాడుట) ఫలములను దేవ దానవులకు పంచి పెట్టి వారికి తినిపించుచు తాను సాక్షిగా నుండును. 25

కలసి యుండును సకలంబందును
కలయు కుండగ సరల కరపల [illegible]
సర్వసృష్టుల్ల జేసి చేయును ఫలములను తినకనుండున్ [illegible]
[illegible]
మెలగి యంతట నిండుకొనుచును
వెలయు గగనమువోలె యంతట శ్రీరమాధవుడు 26

శ్రీలక్ష్మీపతియగు శ్రీహరి ఎల్ల జంతువులందును సంబంధము లేనట్లుగనే ఉండి అని కర్మలను వారి వారి వలెనే తానేజేసి చేయించుచు వాని ఫలములను తాను దినక వారితో నుండును. చిన్నది పెద్దది అయిన బిందెలు కడవలలో ఎక్కువ తక్కువలు లేక అన్ని చోట్ల ఆకాశము వలె వ్యాపించి యుండును, 26

వేడి యినుమును బట్టి కొట్టగ
మూడు వేదన లోహమునకే
యేక వేదన గలుగు నరయున నెటుల జూచినను
జూక హరి జీవులను తాగా
పాడుచుందును లోన బైటను
పాడు కష్టములంట గలవే చిన్మయాత్మునకున్ 27

ఇసుక నిండ్లను గట్టి బాలురు
మసలి యుండియు కొంత కాలము
కొసను జెరచెడు రీతి శ్రీహరి లోకమంతటను
వెసను గట్టుచు పలుదెఱంగుల
అసముడును నిశ్చలుడు గాచును
మెసయు సర్వము బోలువానికి దుఃఖ సుఖమేడ ? 28

పిల్లలు తడిసిన యిసుకతో నిండ్లను జేసి కొంతకాలము ఆడుకొని సంతోషముతో త్రొక్కిసలాడి చెఱచునట్లుగా శ్రీహరి ఎన్నోవిధముగా లోకములను నిర్మించి యందు నందరిలో నుండి రక్షించి పాము తన గుడ్ల తనే మ్రింగి వేయునట్లు చెఱచి వేయును ఇట్టి వానికి సుఖ దుఃఖము లెక్కడివి

వేష భాషలతోడ జనుసం
తోష పర్చెడి నటుని తెఱగున
దోషదూరుడు లోకమున బహురూప వాక్కులను
తోషమిడి తత్త్వస్మరన ములబ్ధి
లాష పూర్తిని జేయు చెపుడును
పోషణంబుల జేయు జ్ఞానమయుండు పూర్ణుండు 29

పవిత్రాత్ముడు, పూర్ణానందమయుడు జ్ఞానమయుడు దోషదూరుడు ను, అయిన శ్రీహరి నటుని వేషముతో మాటలాడుచు ప్రేక్షకులను ముగ్ధుల జేయునట్లు అనేక రూపములు ధరించి లోకమున ఆయా జనుల కోరికలను పూర్తి జేయుచు సంతసించుచు రక్షించును. **29**

అధమ మానవుడొకడు మంత్రౌ
షధుల సిద్ధిని పొందకము మరి
యుదకముల సంబంధ ముందక యుండు నందుననే.
పదుమ జాండోదరుడు నందరి
హృదయమందున కాలగుణ క
ర్మాదులెంపలె కలుష లేపన గల్గునె నిరంజనునకున్ 30

ఒక నీచమానవుడు మంత్రముల సిద్ధిని పొంది స్తంభనాదుల నేర్చుకొని అగ్గిని నీళ్ళను పట్టుకొని వాని బాధలు లేకుండగా జీవవచ్చును కాని మొత్తం బ్రహ్మాండమునే తన కడుపులో బెట్టుకొనినవాడు, అందరి హృదయములలో నుండువాడను దోషరహితుడునైన శ్రీహరికి కాలములు త్రిగుణములు, పాపపుణ్య కర్మలును అంటుకొనగలవా ? **30**

ఒక్క గుణము ననంత గుణములు
నొక్క రూపున నన్ని జగములు
నొక్క రూపము దాల్చి తద్గత వస్తులో బైటన్.
పెక్కు పేరుల నాకసము వలె
నొక్కరుడు పూర్ణ జ్ఞానమున్
జొక్కుచున్ చిన్మయుడు విహారము జేయు చేయుంచున్ 31

# శ్రీ మదాంధ్ర హరికథామృత సారము

## భోజన రస విభాగ సంధి 4

పల్లవి ! హరి కథామృత సారమును
గురు కరుణతో నిటు నేను జెప్పెద
పరమ భగవద్భక్తులిది యాదరమున వినుండు.

వనజ జాండము నందఖిళ చే
తనులు దిను నాల్దెరగులగు భో
జన పదార్థముల నాల్దెరగుతా రసరూపుడగుచున్.
మనుజులకు తినిపించి తిని సం
హనన కుపచయ కరణ సుఖమిడి
యనిమిషులకున్ హరియాత్మ ప్రదర్శన మొసగున్. 1

ఈ బ్రహ్మాండ మందలి సమస్త జీవులు ప్రతి దినము ఆహారమని తీసుకొను పదార్థములు నాల్గు విధములు, ఖాద్య—మింగదగినది, చోష్య—కొఱకదగినది పేయ. త్రాగదగినది లేహ్య నాకదగినది యనునవి పరమాత్మ నాల్గువిధములైన రస రూపముల ధరించి వానిలో నుండి తాను భుజించి సకల జీవులకును తినిపించును. ఈ భోజ్య వస్తువులో నున్న భగవద్రూపముల ను మనము మన హృదయ కమలమందున్న బింబమూర్తిలో ఐక్యమును చింతించి శ్రీహరికి సమర్పించు క్రమము నీ సంధిలో వివరించుచు, వనజ జాండము- బ్రహ్మాండము నందలి జంతువులు దినునట్టి నాల్గువిధ పదార్థములలో నాల్గురూపములతో తా నుండి రసరూపుడై వారి వారికి కావలసిన వానిలో తా నుండి తిని వారికి దినిపించి వారి శరీరములకు పుష్టిని ఇంద్రియములకు సుఖమును ఇచ్చుచు తత్త్వాభిమాని దేవతలకు తన స్వరూపదర్శన సుఖమును ఇచ్చుచున్నాడు. 1

గూడు బోలేడు లింగమునకును
షోడశాత్మక రసము పంచుచు
షోడశాత్మక కళలకును దానుపచయంబిడుచున్.
క్రోడమై డెబ్బదియు నిరువేల్
నాడిగత దేవతల యందున
నాడు నా నందాత్ముడయి చరియించు లోకమునన్. 2

గూటివలె నున్న మన శరీరమునందు పదహారు కళలు 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు 5 మహాభూతములు 1 మనసు ఇట్టి ఇంద్రియములకు పుష్టి నిచ్చుచు వరాహరూపముతో డెబ్బై రెండు నాడులలోనున్న దేవతల యందు తానుండి విహరించుచు ఆనంద స్వరూపుడై లోకమందు సంచరించును. 2

వారి వాచ్యుడు వారి యందును
నారు రసమనబడి యుప్పది
యారు వేలగు నారి నర నాడులను తద్రూపుల్.
ధారకుడు తానగుచు సర్వశ
రీరముల తా రేబవళ్ళు వి
హారమును జేయును బృహతియును పేరటను బరగి. 3

ఉదకనామక పరమాత్మ ఆరు రసములతో నీటిలో నుండి షడ్రస వాచ్యుడై స్త్రీ పురుషుల 36 వేల నాడులలో ఆయా రూపములతో నుండి బృహతియను పేరుతో రాత్రింబవళ్ళు విహరించుచుండును. 3

అరు రస సత్వాది భేదము
నారు మూడైయుండు సారా
సార నీతానీతఖండాఖండచిత్ప్రచురున్.
ఈరధికమై డెబ్బదగు వేల్
మారమణుని రసాఖ్యరూప శ
రీరమున భోజ్య సుపదార్థముల దెలిసి భుజించు 4

ఆరు రసములు 3 రసములలో గుణింపబడి 18 యగును. సారా సార నీతానీత ఖండా ఖండ చిత్ ప్రచుర సంబంధముతో డెబ్బై రెండు వేల గును, శ్రీలక్ష్మి పతియొక్క ఈ డెబ్బది రెండు వేల రసశబ్ద వాచ్యరూపములను మన శరీరమునందును మనము భుజించు ఆహారమునందును చింతించి భుజింపవలెను 6 రసములు, మధుర, ఆమ్ల, లవణ, కటు, కషాయ, తిక్తములు. 4

క్షీర గత రస రూపములు ము
నూరు మరి యేబదియు నాల్గును
చారు ఘృత గత రూపములు నిర్వదియు తొమ్మిదియు.
సార గుడమున నైదు వేలగు
నూరు నొక్కటి రూపులిరవే
లారు నిరుశత పంచ వింశతి రూప ఫలములలోన్. 5

పాలలో నున్న భగవంతుని రసరూపములు 354 నేతిలో 29 రుచికరమైన బెల్లమందు 5101 మరియు పండ్లలో 2825 భగవద్రూపములుండునని ధ్యానించవలెను, 5

విశద స్థిర తీక్ష్ణంబు నిరహార
రసమునందున వేలు నెన్మిది
త్రిశతసపరూపముల చింతించి తినుము విషయములన్.
శ్వాసనుడున్ తత్త్వేశులందున
నెసగు నీ పేరునను బరగుచు
పొసగు మనసున నిట్లు చింతన చేయు విబుధులకున్. 6

రసములందు పాలు నేయి బెల్లం పండ్లు మొ॥ వానిలో 8309 భగవద్రూపములను చింతించి భుజింపవలెను చిత్తాభిమాని మఱియు తత్త్వాభిమాని దేవతలతో ఈ నాల్గు రసరూపముల పిలువబడును. "విశదం క్షీరమాదుర్వ్యం స్థిర మాజ్యస్య తీక్ష్ణకం గుడస్య పన సావినాం నిరహార్య భి ధియతే" (ఐతరేయ భాష్యము) ఇట్లు ధ్యానించు జ్ఞానులకు వారి మనసునందే గోచరించును 6

కపిల నరహరి భార్గవత్రయ
వపువు కన్నుల ముక్కు ముఖమున
శఫరి నాయుడు జిహ్వలో దంతముల హంసాఖ్యున్.
త్రిపది పాద్యై హయాస్యై వాఙ్మయం
డపరిమిత సుఖపూర్ణుడెప్పుడును
త్ర్యపణులందున వారి వారల రసము గొనునిడును. 7

కపిలుడు కన్నులలో, నరహరి ముక్కుచివర పరశురాముడు నోటిలో శఫరి—మత్స్యుడు నాల్కపై హంసాఖ్యుడు పండ్లలో నివసింతురు నిప్పము నిరంతరానంద పూర్ణుడైన పరమాత్మ మానవులలో నీరూపములతో నుండి ఆయా జీవుల ఇంద్రియములతో విషయములను స్వీకరించి వారికి గూఢ తీనిపించి సుఖింప జేయును. త్రిపదీ పాద్య—గాయత్రి ప్రతి పాద్యుడగు శ్రీహయాస్య హయగ్రీవుడు, వాక్యములలో నుండును, 7

నిరుప మానందాత్మ హరి సం
కరుషణుడు ప్రద్యుమ్న రూపున
బరగుచుండుచు భోక్తలకు తచ్ఛక్తి దుండగుచున్.
అరయబడు నారాయణానిరు
ద్ధరును పేరుల భోజ్య వస్తుల
నిరుత తర్పకుడగుచు చేతనులకు తృప్తి నిచ్చున్. 8

సాటిలేని ఆనంద స్వరూపుడగు శ్రీహరి భోజనముజేయు వారిలో సంకర్షణ మరియు ప్రద్యుమ్న రూపములతో తినుటకు సామర్థ్యము నిచ్చువాడైయుండును. నారాయణ మరియు ననిరుద్ధ రూపములతో అహార పదార్థములలో నుండి ప్రతిదినము జీవులకు దినిపించి తృప్తి బరచుచుండును.

వాసుదేవుడు లోన బయట వ
కాశమిడు నాకాశగతుడు ర
మాసహితుడగు నైదు రూపములందు విహరించున్.
ఆసరోరుహ సంభవుడు భవ
వాసవాద్య మరాది చేతన
రాశిగతుడగునంచు దెలిసినవాడే కోవిదుడు 9

వాసుదేవరూపముతో శరీరము లోనను బైటను ఆకాశమునందును ఉండి ఊపిరాడించుట కవకాశమిచ్చును. వాసుదేవస్తుచాన్నస్థో భక్షే సంకర్షణస్తథా! ప్రద్యుమ్నః పరమానస్థోహ్యనిరుద్ధో ఘృతే స్థితః నారాయణస్తు సర్వత్ర ఇత్యేవం ద్యేయమంజసా? (ఐతరేయము) ఐదు రూపములు గలవాడై శ్రీదేవితో సహ జీవుల శరీరమందు విహరించును బ్రహ్మరుద్రేంద్రాది సకల దేవదానవమానవులాది సమస్త జీవులందును శ్రీహరియుండునని తెలుసుకొనినవాడే జ్ఞాని. 9

వాసుదేవుండన్నమున నా
నాసుభక్షుల సంకరుషణుడుకృ
తీశుపరమాన్నమున ఘృతమున శాంతిపతియుండున్.
ఆ సుపర్ణాంసగుడు సూపము
వాసవానుజు శాకమున, మూ
లేశు నారాయణుడు నెలకొనియుండు నెల్లడలన్. 10

పై పద్యములోని ఐతరేయ ప్రమాణము ఈ పద్య తాత్పర్యమున కన్వయింపవలెను, అన్నమందు వాసుదేవుడు పక్వాన్నములలో సంకర్షణుడును, పాయసమందు ప్రద్యుమ్నుడు నేతిలో అనిరుద్ధుడు ఉండుమ గరుడారూఢుడైన శ్రీహరి పప్పులోనను, ఉపేంద్రుడు కూరలలో మరియు మూల పురుషుడగు నారాయణుడు అన్నిటిలో నుండునని తెలుసుకొనవలెను. 10

అగణితాత్ముడు భోజన పదా
ర్థగతుడగుచున ఖండ మొక్కొక
టగు మెతకునను ఖండుడనబడగ బహ్వాంశములన్.
జగతి జీవుల తృప్తి బరచుచు
స్వగత భేద వివర్జితుని యా
తగిన రూపము లెరగితిని యాతని కర్పించు. 11

అగణితరూపములు గల శ్రీహరి మంచి భోజన పదార్థములందు అఖండుడై ఒకొ్కక మెతుకులో నొకొ్కక యంశమున నుండి అనంతాంశములతో ఖండుడై జగతిలోని జీవుల తృప్తిబరచును. స్వరూప భేదరహితుడైన ఇతనిని ఖండా ఖండ రూపములందు తెలుసుకొని తిని అతనికే సమర్పింపవలెను. 11

ఈ పథ మెఱిగి తినువాడు ని
త్యోపవాసి నిరామయుడు ని
ష్పాపి నిత్యమును మహా యాగముల సలుపువాడు.
ప్రాపక మెయగు ఔర యుండు ర
మాపతి కధిష్ఠాన మనుము కృ
పాపయోనిధి మాటలను విను కన్నతల్లివలెన్. **12**

ఈ విధముగా తెలిసికొని భుజించునట్టివాడు నిత్యోపవాసియు రోగము లేనివాడును, పాపరహితుడును ప్రతిదినమును మహాయజ్ఞముల సల్పిన ఫలముల నందువాడును, అగును, చే జారి పోవునవి చిక్కును మరియు రాదగినవన్నియు దొరకును. ఇదంతయు శ్రీహరి గలవని తెలియునది. ఆ దయాసాగరుడు బిడ్డల మాటల తల్లి వినునట్లు ప్రీతితో వినుచుండును. **12**

అరునిరు వేలకును పై ని
న్నూరు నేబది యొక్క రూపున
సార భోక్తుడగు ననిరుద్ధ దేవుండన్న మయుడనగన్.
మూరు నిరు వేలకును పైననె
మూరదిక నల్వాదియు రూపున
చూరగొను ప్రద్యుమ్నుడిలతా ప్రాణమయుడై.

అన్నమయ కోశములో అనిరుద్ధుడు 8251 రూపములతో ప్రాణమయ కోశములో ప్రద్యుమ్నుడు 5543 రూపములతో, శ్రీహరి యున్నట్లు చింతింపవలెను 13

రెండు పైమరి మూడు లక్షల
నుండు సంకరుడు సర్వాది
రెండు వేలకు నేడు నెక్కుడ నూరు రూపములన్.
ఉండు తాను మనోమయుండన
రెండు రెండును వేలు సనఘుడు
రెండు నొక నూటికిని పైనను డెబ్బదియు నాల్గు 14

దోషరహితుడైన సంకర్షణుడు ఐదులక్షల అరువది రెండు వేల నూటా ఏడు రూపములలో మనోమయ కోశములో నున్నాడు. తరువాతి పద్యములో చెప్పబోవు విజ్ఞాన కోశములో నాల్గువేల మూన్నూట డెబ్బై నాల్గు రూపములతో నున్నాడని తెలుసుకొనవలెను. 14

రూపమున విజ్ఞాన మయుడన
నే పరి శ్రీ వాసుదేవుడు
వ్యాప్తిపైపై మహదాది తత్వముల తత్పతులందున్,
ఈ పురుష నామము కతని స్వే
దాపయన రమాంచితా బ్ర
హ్మపరోక్షుల యొక్క లింగాంగములన్ జెరచున్. 15

పై పద్యములో జెప్పినట్లు 4874 రూపములతో విజ్ఞానమయుడను పేరుతో వాసుదేవుడు మహత్తు మొదలగు తత్వములందును, ఆయా తత్వాభిమాని దేవతలందును, వ్యాపించియున్నాడు. ఈ పురుషనామకుని మంగళకరమగు చెమటతో జనించిన విరజానది రూపియైన శ్రీలక్ష్మిదేవి బ్రహ్మపరోక్షుల లింగదేహముమ భంగపరచును. 15

ఐదు వేలానూటయిర్వది
యైదు నారాయణుని రూపము
తా ధరించుచు నెల్లపుడు నా నందమయుడనగన్.
ఐదు లక్షల పైన నెన్బది
యైదు వేల్నన్నూరు రూపున
నైదు కోశాత్మకుడబ్జాండము నిండియుండున్. **16**

శ్రీ మన్నారాయణుడు 5125 రూపముల ధరించి ప్రతి దినము ఆనంద మయుడనబడును అన్నమయ, ప్రాణమయ మనోమయ, విజ్ఞానమయ ఆనంద మయములను ఐదుకోశ రూపులైన అనిరుద్ధ ప్రద్యుమ్న సంకర్షణవాసుదేవ నారాయణుడై 585400 రూపములతో బ్రహ్మాండము వ్యాపించి యున్నాడు. **16**

నూట నొక్కటి రూపమున శాం
తిరమణుడే యన్నమయుడై
నూరు పైత్రయోధిక దశ ప్రాణాఖ్యుడగు ప్రద్యుమ్ను.
చేరి మనసున నేబదైదు వ
కారముల సంకరుషణుండై
నూరు చతురాశీతి జ్ఞానాత్ముండు విశ్వుండు **17**

శాంతిపతియగు ననిరుద్ధుడు 101 స్వరూపములతో అన్నమయుడై యుండును. ప్రద్యుమ్నుడు 513 రూపములతో ప్రాణమయుడై యుండును. సంకర్షణుడు 55 రూపములతో చంచలమైన మనస్సులో మనస్సై యుండును. ప్రపంచమంతయును వ్యాపించియున్న వాసుదేవుడు 184 రూపములతో విజ్ఞాన స్వరూపుడై యుండును 17

మూరు వేలకు నర్ధశతమటు
నిరధిక రూపములతోడ శ
రీరమున నా నందమయు నారాయణాహ్వయుడు.
ఈరు నిరువేలకును పైము
న్నూరు నైదు స రూపములతో
భారతీశునియందు వెన్నను నెయ్యివలెనుండున్, 18

మూలరూపి శ్రీమన్నారాయణుడు 3052 రూపములు ధరించి ప్రాణులలో ఆనంద రూపుడై ముఖ్యప్రాణుని యందుండును. 4305 రూపములతో నేయి వెన్నతో దాగి యున్నట్లు ముఖ్య ప్రాణుని యందు శ్రీహరి దాగి యున్నాడు. 18

చేరి యేబది మూడు ప్రాణ శ
రీరముల ననిరుద్ధుడుండై
నూరు పదునొకండుగ ప్రద్యుమ్నుడపానమునన్.
మూరునను వ్యాను నందైదర
నూరు రూపున సంకరుషణై
నూరు ముప్పది యైదును వాసునను మాయేశున్. 19

అనిరుద్ధుడు ప్రాణవాయు స్వరూప దేహమందు 53 రూపములతోడను, ప్రద్యుమ్నుడు అపాననామక ప్రాణ శరీరమందు 511 రూపములతోడను, సంకర్షణుడు మూడవ వ్యానుడును ప్రాణ శరీరములో 55 రూపములతోడను వాసుదేవుడు (మాయపతి) 535 రూపములతో నుండును. 19

మూల నారాయణుడు నేబది
యేలు నెడై నూరు రూపుల
నేను సర్వత్రము సమానున నుండి సత్వేశు.
లీల జేయును వేయి నేడును
యేలు నూటూపది యొకండును
తాళి పంచ ప్రాణుల నిలిచి లోకముల గాచున్. 20

మూలరూపి శ్రీమన్నారాయణుడు 557 రూపముల ధరించి అన్ని జంతువులందును. సమానముగా ప్రాణదేవుని యందు ఉండును. ఇట్లు శ్రీ హరి 1711 రూపముల ధరించి లీల జేయుచు లోకమును కాపాడుచుండును

త్రినవతి సురూపాత్మకుడు నా
చనిరుద్ధుడున్ యజమానిగా
ననలయము సోమాది పితృ దేవతల కన్పునగన్.
వనయు నా ప్రద్యుమ్న సంకరు
షణ విభాగము సల్పికొని తిన
గనిడు నిత్యానంద జన దాయితుడునైండై. 21

శ్రీహరి 93 రూపములతో అనిరుద్ధుడై ఎల్లప్పుడు శ్రాద్ధాదులందు కర్తయై యుండును, ప్రద్యుమ్నుడైయుండి అగ్నియమ చంద్రుడే మొదలగు పితృదేవతలకు ప్రేరకుడై యుండును సంకర్షణుడై పి విభజించి తాను స్వీకరించి వారలకు దినిపించును. నాల్గవవాడగు వాసుదేవుడు పవిత్రమైన ముఖ భోజనము నిచ్చును

షణ్ణవతి నామకుడు వను శివు
డెన్న భాస్కరులందును ప్ర
పన్నులను దినమందు నిష్కపట సద్భక్తి జేయు.
పుణ్య కర్మల గొనుచు తా కా
రుణ్య సాగరుడా పితరుల క
గణ్య పుణ్యము సుఖము లిడుచును గాచు నెల్లపుడు. 22

96 రూపములు గలిగిన షణ్ణవతియను పేరు గల శ్రీ మన్నారాయణుడు వసుగుణము రుద్రగణములందును సూర్యగణములందును తామండి నిష్కపటులైన భక్తులు సద్భక్తితో నాచరించు పుణ్యకర్మలను స్వీకరించి దయామయుడై పితృవులకు లెక్కలేని సుఖము ప్రసాదించి ఎల్లకాలము రక్షించుచుండును. 22

సుతపు డేకోత్తర మనుపంచా
శతవరణ కిరణము చతుర్వి
శతి సుతత్వపు ధాతువుల ననిరుద్ధుడెప్పుడును
జతన జేయుచు జగతి జీవ
ప్రతతులను షణ్ణవతి నామక
చతుర మూర్తుల పూజ జేతురు బుధులు గావుననే. 23

సుతప-సూర్యనామక పరమాత్మ 51 అక్షరములందును హృదయ కమలము యొక్క 12 దళములందును 24 తత్వములందును 7 దాతువులందును ఉండును. అనిరుద్ధుడు ఎల్లప్పుడు జగత్తులోని జీవరాసులను రక్షించును. కావున జ్ఞానులైనవారు 96 రూపములు ధరించిన నాల్గురూపములను తెలుసుకొని పూజించవలెను. 23

అబ్జజాండోదరుడు వనమున
శబరి యెంగిలి దినుచు గోపం
పబలలను మెచ్చుకొని ఋషిసతులిడిన యన్నములన్.
సుభుజు తా భుజియించె స్వైరమున
కుబుజ గంధము గొనెను మునిజన
విబుధ సేవ్యుడు విడుచునే మే మిడు కర్మఫలముల్. 24

బ్రహ్మాండమును తన కడుపులో ధరించిన శ్రీహరి అడవిలో రామావతారమందు అరణ్య వాసములో శబరి ఎంగిలిని తినెను. గోకులములోని స్త్రీలను తృప్తి పరచెను. స్వైరమునకైనను కుబ్జ సమర్పించిన గంధమును స్వీకరించి ఆమెకు అంగసౌఖ్యము నిచ్చెను ఋషి పత్నులు యిచ్చిన అన్నము స్వీకరించినట్టి స్వామి.దేవతల, ఋషులచే సేవ్యుడైనవాడు మేమిచ్చు కర్మఫలములను స్వీకరించకుండునే? 24

గణన సేయగరాని సుఖ స
ద్గుణములకు సరి లేశమైనను
ఎనయ దగదు రమాబ్జభవశక్రాది సురసుఖమున్.
తినుచు దినుచు మైమరచి కృష్ణా
ర్పణ మనగ గైకొనును శిశు తా
జనని భోజన సమయమున చేజాచు తెరగునను 25

శ్రీహరిలో నున్న అసంఖ్యాకములైన సుఖ సద్గుణముల అనేకాంశములందు ఒక అంశమునకైనను రమా బ్రహ్మ ఇంద్రాదుల సుఖము సమానము కాజాలదు మానవుడు భుజించునప్పుడు ప్రతి ముక్కకును కృష్ణార్పణమనుచు అన్నము ఉనిన తల్లి భోంచేయునప్పుడు శిశువుచే జాచు నట్లు శ్రీహరి దానిని స్వీకరించును 25

జీవకృత కర్మల విహిత సిరి
దేవిరమణుడు గొనుచు ఫలముల
నీవితో నిడు తత్తదధికారానుసారముగన్
పావకుడు సర్వస్వమును దిని
యే వికారము నొందడెప్పుడును
పావనమునకు పావనుడు హరికిని జేమి వింత? 26

జీవాత్ములు జేయు కర్మలను రమా రమణుడు స్వీకరించి వారి వారి యోగ్యతలననుసరించి తగిన విధముగా ఎల్లకాలము వారికి ఫలము లిచ్చును. అగ్ని, సకల వస్తువులను కాల్చివేసి తాను వికార మందక నిగ నిగలాడునట్లు పవిత్ర పదార్థములను పరమ పవిత్రముగా జేయగల పరమాత్మ మన కర్మల స్వీకరించుటలో ఆశ్చర్యమేమి? 26

కలుష జిహ్వకు సుష్టు భోజన
జలములాదిగ విషము లేయగు
కలుష రహితపు నాల్కకయ్యది సురస మెల్లపుడున్
సలలి తాంగున కెల్ల రసములు
గల సుమంగళమెన్న మయ్యుడిక
నిల గొనడె పూతన విషపు చను గుడిచినట్టి హరి 27

రోగముతో రుచి చెడిన నాల్కకు సుష్టు బోజనము మృష్టాన్నములు, నీరు మొదలగు వస్తువులు కూడ చేదుగా పరిణమించును. ఆరోగ్యవంతుని నాల్కకు అవి రుచికరములుగానే యుండును. సర్వాంగ సుందరుడగు శ్రీహరికి అన్ని రసములును ఎల్లప్పుడును రుచికరములుగనే యుండును పూతనయొక్క విషపూరి తస్తనమును గుడిచినవాడు భక్తితో సమర్పించిన దాన్ని స్వీకరించకుండునే? 27

చాల చెప్పగ నేల వాయువు
కాల కూటము మ్రింగి జగమును
పాలనమ్మును జేసెదాసు డొకండమృతుడయ్యెన్.
శ్రీలలన పతియును శుభా శుభ
జాల కర్మల గుడుచు కీడును
మేలు లేవెన్నటికి నితనికి స్వరసముల విడిచి 28

ఏమని చెప్పుదు, వాయుదేవుడు కాలకూట విషమును మ్రాగి లోకమును రక్షించెను. కావుననే హరిదాస శ్రేష్ఠుడొకడు అమృతుడని ప్రసిద్ధి జెందెను. శ్రీదేవి వల్లభుడు జీవుల పాప పుణ్యముల రాశిని, జాలము–రాశి, స్వీకరించును. అతనికి వృద్ధిక్షయము లేవు, ఆనంద రూప రసమును వదలి వేరొక రసమునాతడు స్వీకరించడు, 28

ఈ పరిని యమ్మితుని తత్త్వ
రూపముల తన్నామములనా
నా పదార్థములందు గని భుజించు విషయములన్.
వ్యాపక స్థాపక నియామక
వ్యాపకుండను తెలుగుచు ని
ర్లేపుడై తత్పాదముల నిడు పుణ్య పాపములన్. 29

ఈ విధముగా శ్రీమన్నారాయణుని ఆయా రూపములను ఆయా నామములతో ఏకీభవింపజేసి అనేక పదార్థములందు దలచుచు భుజించవలెను. విషయ స్సుఖములను జీవులకు సంబంధింప జేయువాడు మరియు వారిలో స్థిరముగా నిలుపువాడును, ప్రేరకుడును, వ్యాపకుడును శ్రీహరియే యని తెలిసికొని ఆతని పాదములందు మేము జేసిన పాప పుణ్యముల నర్పించి. 29

ఐదు లక్షల నెన్బదియు తొ
మ్మిదియు వేలును ఏడు నూటా
ఐదు రూపుల బొంది భోక్తయు భోజ్యుడనబరగి.
శ్రీధరా దుర్గారమణ పా
దాది శిర పర్యంత వ్యాప్తిని
మోదమిడు జగన్నాథ విఠలుడు గర్భితాత్మునన్. 30

శ్రీదేవి భూదేవి దుర్గాదేవేరుల పతియగు శ్రీజగన్నాథ విఠలుడు 589705 రూపములతో భోజ్య వస్తువులు భుజించువాడును, తానే అయి మానవుల శరీరములో కాలి నుండి తల వరకును వ్యాపించికొని యుండి వారిని రక్షించును, 30

****************************

## శ్రీ మదాంధ్ర హరికథాసుసారము

## వ్యాఖ్యానముతో




( ఐదవ భోజన రస విభాగ సంధి సమాప్తము )

****************************